ఆంధ్ర

# సంస్కృత వ్యాకరణము

(ప్రథమ శిక్షాత్మకము.)

ఇది

ఆంధ్రవిద్యార్థుల సహాయార్థము

పి. ఆర్. కాలేజీహైస్కూలులో సహాయోపాధ్యాయుఁడుగానుండిన

వేదము సూర్యనారాయణశాస్త్రిగారు

రచించినది.





[illegible]టికూర్పు.

చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

 [Price Rs. 1-4-0.

# సంస్కృత వ్యాకరణము

(ప్రథమశిక్షాత్మకము.)

ఇది

ఆంధ్రవిద్యార్థుల సహాయార్థము

వి. ఆర్. కాలేజీ హైస్కూలులో సహాయోపాధ్యాయుఁడుగానుండిన

**వేదము. సూర్యనారాయణశాస్త్రిగారిచే**

రచించినది.



మొదటికూర్పు.

చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

 [*Price Rs.* 1-4-0.

"కం. ..............

....................

పలువిద్య లెన్నియైనను

గులవిద్యకు సాటిరావు గువ్వలచెన్నా!"

చాటువు.

"దేశభాషలందుఁ దెలుఁగు లెస్స".—

శ్రీ కృష్ణదేవరాయలు.

# తొలిపలుకు.

బ్రహ్మశ్రీ వేదము సూర్యనారాయణశాస్త్రిగారు రచించిన ఆంధ్ర సంస్కృత వ్యాకరణమును పరిశీలించితిని. శ్రీ శాస్త్రుల వారు తమ వార్ధకమును సయితము లెక్కింపక శ్రమఁజేసి ఈ గ్రంథమును నిర్దుష్టముగఁ బ్రకటించినందున ఆంధ్ర దేశీయులకు స్వభాషలో సులభముగ సంస్కృతమున ప్రథమప్రవేశమున కనువగు పొత్తము లేని కొఱంత ప్రాయికముగఁ దీరినది. రాజ భాషను ప్రధానముగ నభ్యసించు సంస్కృతము నుపభాషగ పఠింపఁగోరిన విద్యార్థులకు ముఖ్యముగ నియ్యది అత్యంతోప యుక్తము.

వేదసంస్కృతకలాశాల,
నెల్లూరు.
13—1—1943

గా. హనుమచ్ఛాస్త్రి,
అధ్యక్షుఁడు.

# ప్రస్తావన.

సంస్కృతమునకు ఆంధ్రభాష పెద్దకొమారితవంటిది. తల్లి లక్షణములు మెండుగా పెద్దకొమారితయందగపడునట్లే ఆంధ్రమునందు సంస్కృతభాషయొక్క లక్షణము లెన్నియో కానవచ్చును.

అట్లయ్యును ఆంధ్రభాషలో ఇటీవల వెలువడిన రెండు మూఁడు గ్రంథములుతప్ప ఇప్పటికి బాలురకు సంస్కృత వ్యాకరణము బోధించు గ్రంథములు వేఱు కానరావు. గడచిన అఱువది డెబ్బదియేండ్లుగా పాఠశాలలయందు క్లిష్టమైన ఆంగ్లపరిభాషలో రచింపఁబడిన సంస్కృతవ్యాకరణములే పాఠ్యపుస్తకములుగా ఉన్నవి. ఇవి యాంగ్లము చక్కఁగాఁ జదివి యర్థముఁజేసికొనఁగల విద్యార్థులకుఁగూడ ఉపాధ్యాయ నిరపేక్షముగా బోధపడునవి కావు.

ఇందువలన వీనిని బోధించుటకు మూఁడుభాషలు (సంస్కృతము, ఆంగ్లము, ఆంధ్రము) సమానముగాఁ దెలిసిన పండితులు కావలసివచ్చినది. ఇట్టివారు దొరకుట దుర్లభమగుటంజేసి బాలురకు విషయము చక్కఁగా బోధగాక సంస్కృతము మిగుల కష్టమైన భాష యను భావముకలిగి కాలక్రమమున దానిని బొత్తిగా వదలుకొనుట సంభవించినది.

ఇదియే పాఠశాలలందు ఏతరగతిలోఁగాని పదిపండ్రెండు గురు సంస్కృత విద్యార్థులకన్న నెక్కువమంది చేరకపోవుటకుఁ గారణము. పాఠశాలాధికారు లిందలికారణముఁ దెలిసి కొనక తటస్థముగా నుండుటచే సంస్కృతవిద్య మఱింత యధోగతికి వచ్చినది. మాతృభాషకుఁబట్టిన యీ దురవస్థను జిరకాలము చూడనొల్లక విద్యార్థుల విముఖతను యథాశక్తిఁ దొలఁగింపఁ దలంచి యీ గ్రంథరచనకు గడంగినాఁడను.

ఇందులకై ప్రసిద్ధములగు ప్రాచీనాధునిక సంస్కృత వ్యాకరణములఁ బెక్కింటిని శోధించి యందలి బోధనాపద్ధతు లనే యనుసరించి బాలురకువలయు ముఖ్యాంశములను సమ కూర్చి దీనిని రచించినాఁడను.

ఇట్టి యితర గ్రంథములలోఁ జెప్పఁబడిన విషయముల కన్న దీనియందు ఎక్కువవిషయములు కానగును.

హైస్కూలు విద్యార్థులకుఁ గావలసిన యంశముల కన్ననిందు ఎక్కువ యంశములు బోధింపఁబడి యున్నవి.

అక్షరగుణితము దెలిసిన ప్రతిబాలుఁడునుగూడ దీనిని పరాపేక్ష లేకయే చదివి యర్థముచేసికొనునట్లు తేట తెలుఁగు లో సంధులు విడఁదీసి వ్రాయఁబడియున్నది. మఱియు గ్రంథ ములో వాడఁబడిన కఠినపదములకేమి, ఉదాహరణములకేమి అన్నిటికిని అర్థము చెప్పఁబడినది. బాలురు సులువుగా జ్ఞప్తి యందుంచుకొనుటకు సంధిసూత్రములకు మూలసూత్రములు

కూడ వ్రాయఁబడినవి. ఇదిగాక అచ్చటచ్చట సంస్కృతమున కును ఆంగ్లాంధ్రములకును గల సాదృశ్యము తేటపఱుపఁబడు టయేగాక సంస్కృత పరిభాషకుఁ దుల్యమగు నాంగ్ల పరిభాష యును దెలుపఁబడినది. కావున, ఇది పిన్న విద్యార్థులకు వలయు సాయమొసంగి భాషాభివృద్ధికై నాపడినశ్రమను సార్థకముఁ జేయవలయునని సర్వేశ్వరునిఁ బ్రార్థించుచున్నాను.

ఈ గ్రంథ రచనలో సుప్రసిద్ధులును లోకోపకారధు రీణులునగు నాధునిక వైయాకరణులవలన నేను పొందిన సాయమునకు వారికెల్లరకును నాభక్తిపూర్వక నమస్కృతు లర్పించుచున్నాను.

ఇట్లు,

నెల్లూరు.
7—12—45.

విద్యార్థి శ్రేయోభిలాషి,
వేదము సూర్యనారాయణశాస్త్రి.

—

# విషయ సూచిక.

అధ్యాయము పుట

# సంస్కృత వ్యాకరణము.



## అధ్యాయము - ౧.

1. సంస్కృత భాష యనఁగా పూర్వకాలము ఈ దేశములో చదువుకొన్నవారు వాడుచుండిన పవిత్రమగు భాష.

### సంజ్ఞలు - అక్షరములు.

2. ఈ భాషకు నలువది యెనిమిది అక్షరములు కలవు. ఇవి అచ్చులని, హల్లులని రెండు విధములు. వీనిలో అచ్చులు పదుమూఁడు, హల్లులు ముప్పది యైదు.

### అచ్చులు (Vowels).

अ అ, आ ఆ, इ ఇ, ई ఈ, उ ఉ, ऊ ఊ, ऋ ఋ, ॠ ౠ, ऌ ఌ, ए ఏ, ऐ ఐ, ओ ఓ, औ ఔ అనునవి. ఇవి 'ప్రాణులు' అనఁగా వీనికి వేరు వర్ణములు (అక్షరములు) చేరకయే పూర్తిగా పలుకును. కావున ఇవి 'స్వరములు' అని చెప్పఁబడును. వీనిలో ए, ऐ, ओ, औ లు సంయుక్తాచ్చులు, అనఁగా ఒక్కొక్కటి రెండేసి అచ్చులు చేరి ఏర్పడినవి. తక్కిన వానివలె కేవలాచ్చులు కావు.

అచ్చులు 'హ్రస్వములు' (పొట్టివి) అని, 'దీర్ఘములు' (పొడుగువి) అని రెండువిధములు. अ, इ, उ, ऋ, ऌ అనునవి హ్రస్వములు. आ, ई, ऊ, ॠ, ए, ऐ, ओ, औ దీర్ఘములు.

## హల్లులు (Consonants)

1. కంఠ్యములు. क క్, ख ఖ్, ग గ్, घ ఘ్, ङ ఙ్
Gutturals

2. తాలవ్యములు. च చ్, छ ఛ్, ज జ్, झ ఝ్, ञ ఞ్
Palatals

3. మూర్ధన్యములు. ट ట్, ठ ఠ్, ड డ్, ढ ఢ్, ण ణ్
Linguals

4. దంత్యములు. त త్, थ థ్, द ద్, ध ధ్, न న్
Dentals

5. ఓష్ఠ్యములు. प ప్, फ ఫ్, ब బ్, भ భ్, म మ్
Labials

వీనికి స్వతంత్రమైన ఉచ్చారణ అనఁగా పలుకుబ లేదు. కాఁబట్టి వీనికి अ కారము చేర్చి 'क క, ख ఖ, च చ छ ఛ' అని పలుకుదురు.

3. ఈ హల్లులలో మొదటి వరుసలో నుండువాని ఉత్పత్తిస్థానము (పలుకునట్టి స్థానము) కంఠము గనుక ఇ 'కంఠ్యములు' అనఁబడును. వీనినే 'క' వర్గమని చెప్పుదురు.

రెండవ వరుసలోనివానికి తాలువు అనఁగా లో దవుడలు స్థానము—కావున వీనిని 'తాలవ్యములు' అని చె దురు. వీనికి 'చ' వర్గమని పేరు.

మూఁడవ వరుసవానికి మూర్ధము లేక తల స్థానము గనుక వీనికి 'మూర్ధన్యములు' అని పేరు. వీనిని 'ట' వర్గ మందురు.

నాల్గవ వరుసవానికి దంతములు (పండ్లు) స్థానము. వీనిని 'దంత్యములు' అని 'త' వర్గమని చెప్పుదురు.

అయిదవ వరుసవానికి ఉత్పత్తిస్థానము ఓష్ఠములు అనఁగా పెదవులు. ఇందువలన వీనిని 'ఓష్ఠ్యములు' అని 'ప' వర్గమని అందురు.

4. 'క' కారము మొదలు 'మ' కారముతో అంతమగు వర్ణములు 'స్పర్శములు'.

य, र, ल, व, అను వర్ణములు పైన చెప్పిన అయిదు వర్గములకును, ఊష్మములు (Sibilants) అనఁగా श, ष, स, ह లకును నడుమ ఉండుటచేత "అంతఃస్థములు" (Semi-Vowels) అను పేరును పొందినవి.

श, ष, स, ह లు ఊష్మములు - ఇవి శ్వాసతో పలుకు నట్టి వర్ణములు. వీనిలో ह 'మహాప్రాణము' (Aspirate) అనఁబడును. మహాప్రాణమనఁగా బలమగు శ్వాసతో పలుకునది.

5. ఈ క్రింది వర్ణములస్థానములను కూడ జ్ఞప్తియం దుంచుకొనవలెను.

(1) अ, आ, हः (h) - కంఠ్యములు.

ః విసర్గ (h) - ఇది ఒక పదము చివరవచ్చునట్టి 'హ' కారమునకు గుర్తు. ఉ.—रामः (రామః)

(2) इ, ई, य, श—తాలవ్యములు.

(3) ऋ, ॠ, र, ष—మూర్ధన్యములు.

(4) ऌ, ॡ, ल, स—దంత్యములు.

ౘ, ౙ ఉపధ్మానీయము-ఓష్ఠ్యములు. प, फ లకు ముందు వచ్చునట్టి అర్ధవిసర్గకు 'ఉపధ్మానీయము'అని పేరు. ఉ-ॅप, ॅफ.

ञ, म, ङ, ण, न లకు ముందు చెప్పిన ప్రత్యేకస్థానములు గాక నాసిక అనఁగా ముక్కు కూడ స్థానము. కాఁబట్టి వీనిని 'అను నాసికములు' (ముక్కుతో పలుకునవి) అందురు.

ए, ऐ లకు కంఠము తాలువులు, ओ, औ లకు కంఠము, ఓష్ఠములు, व అను వర్ణమునకు దన్తములు, ఓష్ఠములును, జిహ్వా మూలీయమునకు అనఁగా क, ख లకు ముందు వచ్చు నట్టి అర్ధవిసర్గకు జిహ్వాయొక్క మూలము లేక నాలుకయొక్క మొదలు స్థానము. ఉ- ॅक, ॅख.

6. మొదటి అయిదు వర్గములలోని కడపటి మూఁడు వర్ణములును, అంతఃస్థములు, ह యును చేరి 'హశ్శు'లు (Soft Consonants) అనఁబడును. తక్కినవి 'ఖర్రు'లు (Hard Consonants) అనఁబడును.

7. म अనువర్ణమునకు గుఱ్తుగా ఏదేని ఒక అక్షరము పైన ఉండునట్టి బిందువు లేక చుక్కకు 'అనుస్వారము' అని పేరు. అనుస్వారము కేవలము నాసిక (ముక్కు)తో పలుకు నట్టి వర్ణము. ఉ- अंशः (భాగము) అనుచోట अ కారము మీఁద నున్న చుక్క 'అనుస్వారము'.

8. కొన్నిచోట్ల య్ల, వ్ల, ల్ల అనునవి అనునాసికము లగును. అప్పుడు వానిని య్లఁ, వ్లఁ, ల్లఁ అని అర్ధ చంద్రాకారపు గీతలో చుక్క పెట్టి వర్ణముపైన వ్రాయవలెను. ఈగుర్తును 'చంద్రబిందువు' అందురు.

## అక్షరములను వ్రాయువిధము.

1. ఉత్తహల్లును వ్రాయునప్పుడు దానిక్రింద గీతపెట్టి వ్రాయవలెను. ఉ - क्.

2. హల్లుతో అచ్చులు చేరినపుడు क క, का కా, कि కి, की కీ, कु కు, कू కూ, कृ కృ, कॄ కౄ, कॢ కౢ, के కే, कै కై, को కో, कौ కౌ అని వ్రాయవలెను.

హల్లుతో आ, इ, ई మొదలగు అచ్చులు చేరినపుడు పైవిధముగా వ్రాయవలెను.

अ కారముతో చేర్చి సంయుక్తహల్లులను ఒకటిగా వ్రాయువిధము:—

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| क्क | క్క | क्म | క్మ | क्ष | క్ష | ग्न | గ్న |
| क्ख | క్ఖ | क्य | క్య | क्ष्ण | క్ష్ణ | ग्र | గ్ర |
| क्च | క్చ | क्र | క్ర | क्ष्म | క్ష్మ | ग्र्य | గ్ర్య |
| क्त | క్త | र्क | ర్క | क्ष्य | క్ష్య | ग्ल | గ్ల |
| क्त्य | క్త్య | क्ल | క్ల | क्ष्व | క్ష్వ | ग्व | గ్వ |
| क्त्व | క్త్వ | क्व | క్వ | ख्य | ఖ్య | घ्न | ఘ్న |
| क्न | క్న | क्व्य | క్వ్య | ग्ध | గ్ధ | घ्य | ఘ్య |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| र्घ्य | ర్ఘ్య | ण्म | ణ్మ | द्द | ద్ద | प्ल | ప్ల |
| घ्र | ఘ్ర | ण्य | ణ్య | द्ध | ద్ధ | प्स | ప్స |
| घ्व | ఘ్వ | ण्व | ణ్వ | द्भ | ద్భ | ब्ज | బ్జ |
| ङ्क | ఙ్క | त्त | త్త | द्म | ద్మ | ब्द | బ్ద |
| ङ्क्त | ఙ్క్త | त्त्र | త్త్ర | द्य | ద్య | ब्ध | బ్ధ |
| च्च | చ్చ | त्थ | త్థ | र्द्य | ర్ద్య | ब्य | బ్య |
| च्छ | చ్ఛ | त्म्य | త్మ్య | द्र | ద్ర | ब्र | బ్ర |
| च्छ्र | చ్ఛ్ర | त्र्य | త్ర్య | द्र्य | ద్ర్య | भ्य | భ్య |
| च्छ्व | చ్ఛ్వ | थ्य | థ్య | द्व | ద్వ | भ्र | భ్ర |
| च्म | చ్మ | र्थ्य | ర్థ్య | ध्न | ధ్న | म्म | మ్మ |
| च्य | చ్య | त्न | త్న | ध्म | ధ్మ | म्य | మ్య |
| र्च्य | ర్చ్య | त्प | త్ప | ध्य | ధ్య | र्म्य | ర్మ్య |
| ज्ज | జ్జ | त्प्र | త్ప్ర | ध्र | ధ్ర | म्र | మ్ర |
| ज्र | జ్ర | त्फ | త్ఫ | ध्व | ధ్వ | म्ल | మ్ల |
| ज्व | జ్వ | त्म | త్మ | न्न | న్న | र्ण्य | ర్ణ్య |
| ट्ट | ట్ట | त्य | త్య | न्म | న్మ | र्ध्व | ర్ధ్వ |
| ट्य | ట్య | त्र | త్ర | न्य | న్య | ल्क | ల్క |
| ठ्य | ఠ్య | त्व | త్వ | न्व | న్వ | ल्प | ల్ప |
| ड्य | డ్య | त्स | త్స | प्त | ప్త | ल्म | ల్మ |
| ढ्य | ఢ్య | त्स्न | త్స్న | प्न | ప్న | ल्य | ల్య |
| र्ढ्य | ర్ఢ్య | त्स्य | త్స్య | प्य | ప్య | ल्ल | ల్ల |
| ण्ण | ణ్ణ | द्ग | ద్గ | प्र | ప్ర | ल्व | ల్వ |

| | | | |
|---|---|---|---|
| व्य వ్య | ष्क ష్క | ष्म ష్మ | स्र స్ర |
| र्व्य ర్వ్య | ष्क्र ష్క్ర | ष्य ష్య | ह्ण హ్ణ |
| व्र వ్ర | ष्ट ష్ట | र्ष्य ర్ష్య | ह्न హ్న |
| श्च శ్చ | ष्ट्य ష్ట్య | ष्व ష్వ | ह्म హ్మ |
| श्न శ్న | ष्ट्र ష్ట్ర | स्क స్క | ह्य హ్య |
| श्म శ్మ | ष्ट्व ష్ట్వ | स्ख స్ఖ | र्ह्य ర్హ్య |
| श्य శ్య | ष्ठ ష్ఠ | स्त స్త | ह्र హ్ర |
| र्श्य ర్శ్య | ष्ठ्य ష్ఠ్య | स्थ స్థ | ह्ल హ్ల |
| श्र శ్ర | ष्ण ష్ణ | स्न స్న | ह्व హ్వ |
| श्र्य శ్ర్య | र्ष्ण ర్ష్ణ | स्फ స్ఫ | |
| श्ल శ్ల | ष्प ష్ప | स्म స్మ | |
| श्व శ్వ | ष्प्र ష్ప్ర | स्य స్య | |

వీనితో अ, आ, इ, ई మొదలగు అచ్చులు చేరినపుడు का, कि, की మొదలగు వానివలెనే వ్రాయవలెను.

ఉ.—प्ता ప్తా, क्ति క్తి, न्त्री న్త్రీ, क्नु క్ను, ग्यो గ్యో, क्रौ క్రౌ, न्त्रू న్త్రూ, श्र्यौ శ్ర్యౌ మొ.

## అధ్యాయము ౨.

## మాహేశ్వరసూత్రములు.

అక్షరములనన్నింటిని తెలిసికొనుటకు సూత్రములు.

ఇవి యేవనఁగా - अइउण्, ऋऌक्, एओङ्, ऐऔच्, हयवरट्, लण्, ञमङणनम्, झभञ्,। घढधष्, जबगडदश्, खफछठथचटतव्, कपय्, शषसर्, हल्.

వీనివలన 'ప్రత్యాహారములు' అనఁగా కావలసిన అక్షరములను ఒకటిగా చేర్చి సంగ్రహముగా చెప్పునట్టి పద్ధతి ఏర్పడినది. అది ఎట్లనఁగా— अइउण् అను సూత్రములో మొదటనుండు अ అనువర్ణమును చివరనుండు ण् అను వర్ణమును చేర్చిన अण् అను ప్రత్యాహార మేర్పడును. ఇది మొదటి अ అను అచ్చునకును इ उ అను అచ్చులకును గుర్తు. ఇందు తుదనుండు ण् అను వర్ణము अ, इ, उ అను వానిని ఒకటిగా చేర్చి చెప్పుటకు ఆధారమేగాని వానితో చేరదు. అనఁగా ప్రత్యాహారములలో తుదివర్ణమును వదలివేయవలెను. ఇట్లే अक् అనునది अ इ उ ऋ ऌ అను వానికి గుర్తు. अच् అనునది अ మొదలు च् వరకు నుండు వర్ణములను, हल् అనునది ह మొదలు ल् వరకు నుండు వర్ణములను తెలుపును. ఇదియే 'అచ్చులు' 'హల్లులు' అను పేళ్లకు కారణము (మా. సూ. णादयोऽणाद्यर्थाः)

---

# అధ్యాయము. 3.

## సన్ధి ప్రకరణము.

'సన్ధి' యనఁగా ఒకటిగా చేరుట. సంస్కృతములో ఎదురెదురుగానుండు రెండువర్ణములను వెవ్వేఱుగా పలుకుట కష్టమైనపుడు ఆ రెంటిని గాని ఒక దానిని గాని తీసి వైచి మఱియొక వర్ణమునుగాని రెండువర్ణములను గాని పలుకుట కలదు. ఈయేర్పాటుకు సన్ధి యని పేరు.

### I. అచ్‌సన్ధి (అచ్చులను ఒకటిగా చేర్చుట.)

సవర్ణమనఁగా తనజాతిలో చేరిన వర్ణము. రెండువర్ణములకు పలుకునట్టి స్థానము ఒకటే అయినయెడల ఆరెండును 'సవర్ణము' లని చెప్పఁబడును. ఉదా - अ, आ లకు अ గాని आ గాని సవర్ణములు. इ, ई లకు इ గాని ई గాని సవర్ణములు. అంతే గాని अ, आ లకు इ, ई లు సవర్ణములు కావు.

1. హ్రస్వదీర్ఘములైన अ इ उ ऋ ऌ (अक्) లకు సవర్ణముపరమైనపుడు పూర్వపరములకు బదులుగా అనఁగా మొదటి దానికిని రెండవ దానికిని బదులుగా మొదటి అచ్చే దీర్ఘమైవచ్చును. (अकः सवर्णे दीर्घः)

ఉ.—मम+अन्नम् = ममान्नम् (నాఅన్నము) ఇచట म् అను హల్లుతో अ అను అచ్చుచేరుటచేత म అయినది కావున. अ కారమునకు अ కారము పరమయినది.

तव+आशा = तवाशा (నీ ఆశ) ఇచ్చట अ కారమునకు आ కారము పరమయినది.

धरा+अधिपः = धराधिपः (భూమి నేలువాఁడు)
कथा+आरम्भः = कथारम्भ : (కథయొక్క ఆరంభము).
कवि+ईशः = कवीशः (కవులలో శ్రేష్ఠుఁడు)
गुणी+इह = गुणीह (గుణవంతుఁడు ఈలోకమున)
वाणी+ईशः = वाणीशः (సరస్వతికి. ఈశుఁడు లేక బ్రహ్మ)
वदति+इति = वदतीति (చెప్పును అని)
गुरु+उष्णम् = गुरूष्णम् (హెచ్చు వేడిమి)
साधु+उक्तम् = साधूक्तम् (బాగుగా చెప్పఁబడినది)
चमू+उत्साहः = चमूत्साहः (సేనయొక్క ఉత్సాహము)
वधू+ऊरुः = वधूरुः (స్త్రీయొక్క తొడ)
पितृ+ऋणम् = पितॄणम् (తండ్రికి అప్పు)
कर्तृ+ऌकारः = कर्तॄकारः (కర్తయొక్క ఌకారము)
कर्तॄकारः - ఇట ऋ, ऌ వర్ణములు సవర్ణములు.

2. अ, आ లకు హ్రస్వదీర్ఘములగు इ उ ऋ ऌ లు పరమైనపుడు పూర్వములకు బదులు రెండవవాని గుణము వరుసగా ఏకాదేశమగును (ఒకటే వచ్చును). (आद्गुणः)

इ, ई లకు గుణము ए
उ, ऊ లకు ,, ओ
ऋ, ॠ లకు ,, अर्
ऌ కు ,, अल्

ఉదా:—गच्छ+इति = गच्छेति (పొమ్ము అని)

रमा+इयम् = रमेयम् (లక్ష్మి ఈమె)

तव+ईशः = तवेशः (నీ ప్రభువు)

आत्मा+ईप्सितम् = आत्मेप्सितम् (తనచేత కోరం బడినది)

मम+उन्नतिः = ममोन्नतिः (నా హెచ్చు)

रम्भा+उवाच = रम्भोवाच (రంభ చెప్పెను)

तव+ऊहा = तवोहा (నీ ఊహ)

स्थिरा+ऊर्ध्वम् = स्थिरोर्ध्वम् (భూమికి పైన)

घन+ऋद्धिः = घनर्द्धिः (గొప్పవృద్ధి)

पर+ऌकारः = परल्कारः (పరమైన ఌకారము)

अक् (ए, ऐ, ओ, औ లు తప్ప తక్కిన అచ్చులకు)

(హ్రస్వ ऋకారము పరమైనపుడు సన్ధి వైకల్పికము-సన్ధి రానపుడు వానికి హ్రస్వమువచ్చును - హ్రస్వము రానపుడు సన్ధివచ్చును.

ఉదా:—ब्रह्मा+ऋषिः = ब्रह्मऋषिः లేక ब्रह्मर्षिः—(ऋत्यकः)

4. अ, आ లకు ए, ऐ లు పరమయినపుడు పూర్వపరములకు బదులుగా ऐ అను వృద్ధి అక్షరమును, ओ, औ లు పరమైనపుడు औ అనువృద్ధి అక్షరమును ఏకాదేశమగును. (वृद्धिरादैच्)

| | | | |
|---|---|---|---|
| अ आ లకు | వృద్ధి | అక్షరము | आ |
| इ ई ए ऐ లకు | ,, | ,, | ऐ |
| उ ऊ ओ औ లకు | ,, | ,, | औ |
| ऋ ॠ లకు | ,, | ,, | आर् |
| ऌ కు | ,, | ,, | आल् |

ఉదా:—मम+एव = ममैव (నాకే)

रमा+एति = रमैति (లక్ష్మివచ్చును)

तस्य+ऐश्वर्यम् = तस्यैश्वर्यम् (వానియొక్క ఐశ్వర్యము)

सुत्रामा+ऐरावतः = सुत्रामैरावतः (ఇంద్రునిఐరావతము)

वन+ओषधिः = वनौषधिः (అడవిమూలిక)

शूर+औत्सुक्यम् = शूरौत्सुक्यम् (శూరునియొక్క ఉత్సాహము)

दुर्गा+ओष्ठः = दुर्गौष्ठः (పార్వతియొక్క పెదవి)

कुटिला+औद्धत्यम्=कुटिलौद्धत्यम् (దుష్టురాలిదౌర్జన్యము)

5. పదాన్తమందుండు హ్రస్వదీర్ఘములైన इ, उ, ऋ ऌ (इक्) లకు మఱియొకపదము మొదటనుండు అసవర్ణముపరమయినయెడల వానికి మారుగా य्, व्, र्, ल् లు వరుసగా వచ్చును. (इकोयणचि)

ఎట్లనఁగా—

इ, ई లకు ... य्

उ, ऊ లకు ... व्

ऋ కు ... र्

ऌ కు ... ल्

ఉదా:—इति+अवदत् = इत्यवदत् (అని చెప్పెను)

इति+आज्ञा = इत्याज्ञा (అని ఉత్తరువు)

వీనిలో इ కారమునకు अ आ లు అసవర్ణములు కావున य् వచ్చినది.

मधु+आनयति = मध्वानयति (తేనెతెచ్చుచున్నాఁడు)

धातृ+अंशः = धात्रंशः (బ్రహ్మయొక్క అంశము)

ऌ+आकृतिः = लाकृतिः ('ఌ' యొక్క ఆకారము)

వీనిలో उ, ऋ, ऌ లకు పరమయినవి అసవర్ణములు గావున వానికి మారుగా व्, र्, ल् లు వచ్చినవి.

इति+एवम् = इत्येवम् (అని ఇట్లు)

गुणी+एषः = गुण्येषः (గుణవంతుఁడు వీఁడు)

धनी+ऐच्छत् = धन्यैच्छत् (ధనవంతుఁడు కోరెను)

వీనిలో इ ई లకు ए ऐ లు అసవర్ణములు. కావున వానికి य् వచ్చినది.

ओ, औ లు పరమైనపుడును ఇట్లే य् వచ్చును.

ఉదా:—दधि+ओदनम् = दध्योदनम् (పెరుఁగన్నము)

वृद्धि+औषधम् = वृद्ध्यौषधम् (వృద్ధికి మందు)

6. పదాన్తమందుండు ए, ओ లకు अ వర్ణము పరమైన యెడల పరమైన अ వర్ణమునకు లోపము కలుగును. అనఁగా అది పలుకఁబడదు. దాని స్థానములో ऽ అనుగుర్తు పెట్టఁబడును. దీనికి 'అవగ్రహ' మని పేరు. (एङः पदान्तादति)

ఉదా:—ते+अम्बा = तेऽम्बा (నీతల్లి)

शम्भो+अव = शम्भोऽव (ఓశివుఁడా కాపాడుము)

7. ए, ओ ऐ औ (एच्) లకు అచ్చు పరమయినపు వానికి క్రమముగా अय्, अव्, आय्, आव् లు వచ్చును. పర మైన అచ్చుమాత్రము అట్లే ఉండును. వీనిలోని य्, व् ల పదాన్తమందుండెనేని వానికి సన్ధి వైకల్పికను, అనఁగా సన్ధి చేసిన చేయవచ్చును. లేదా వదలివేయవచ్చును. ఇట్లు వదలి వేయుటవలన వాని కెదురగు అచ్చులకు సన్ధి రాదు.

(एचोयवायावः, लोपः शाकल्यस्य)

ఉదా:—ते+इच्छन्ति = तयिच्छन्ति లేక तइच्छन्ति (వారుకోరు చున్నారు)

गुरो+एहि = गुरवेहि లేక गुरएहि (గురువా, రమ్ము)

कस्मै+अयच्छत् = कस्माययच्छत् లేక कस्मा अयच्छत् (ఎవని కిచ్చెను?)

तौ+आगतौ = तावागतौ లేక ताआगतौ (వారిద్దఱు వచ్చి నారు)

8. ఉపసర్గ (Preposition) చివరనుండు अ, आ లకు ఏదేనిధాతువు (క్రియయొక్క తొలిరూపము) మొదటనుండు ऋ కారము పరమైనచో వృద్ధి ఏకాదేశ మగును.

(उपसर्गादृति धातौ)

ఉదా:—प्र + ऋच्छति = प्रार्च्छति (వాఁడు వడిగా పోవుచు న్నాఁడు)

9. ఉపసర్గ (Preposition) చివరనుండు अ, आ లకు ధాతువు (Verbal root) మొదటనుండు ए, ओ లు పరమైన యెడల పూర్వపరములకు బదులు ए, ओ లే ఏకాదేశ మగును. కాని ఈ अ, आ లు इ=పోవు एध् = పెరుఁగు అనుధాతువుల యొక్క రూపములకు మొదటనుండు ए తో చేరినపుడు ए కు బదులు ऐ వచ్చును. (एङि पररूपम् ; एत्येधत्यूठ्सु)

ఉదా:—प्र+एजते = प्रेजते (వాఁడు వణకుచున్నాఁడు)

परा+ओहति = परोहति (అమితముగా స్తుతి చేయుచు న్నాఁడు)

अव+एति = अवैति (తెలిసికొనును)

परा+एधते=परैधत (విరుద్ధముగా వృద్ధియగుచున్నాఁడు)

10. ధాతువుయొక్క అర్థమును మార్చుటకు దానికి ముందు ఉంచఁబడు प्र, उप, अव, अनु మొదలగువానికి 'ఉపసర్గ' లని పేరు. (उपसर्गाः क्रियायोगे)

11. ई, ऊ, ए లు ఒక నామవాచకముయొక్కగాని క్రియారూపముయొక్కగాని ద్వివచనమునకు చివర నున్న యెడల వానికి అచ్చుపరమైనను సన్ధి రాదు. అప్పుడు వానిని 'ప్రగృహ్యము' లందురు. (ईदूदेद्द्विवचनं प्रगृह्यम्)

ఉదా:—हरी+इमौ = हरी इमौ (ఈ ఇద్దఱు హరులు)

शम्भू+एतौ = शम्भू एतौ (ఈ ఇద్దఱు శంభువులు)

रमे+इमे = रमे इमे (ఈ ఇద్దఱు లక్ష్ములు).

भजेते+अमू = भजेते अमू (వీ రిద్దఱు అనుభవించుచున్నారు)

याचेते+इदम् = याचेते इदम् (ఇద్దఱు దీనిని యాచించుచున్నారు)

युध्येते+उभौ = युध्येते उभौ (వారిద్దఱు యుద్ధముచేయుచున్నారు)

अमू (వీరిద్దఱు), अमी (వీరందఱు) అను సర్వనామములయందలి ఈ, ఊ లకుకూడ అచ్చుపరమైనను సన్ధి రాదు.

ఉదా:—अमी+ईशाः = अमी ईशाः (వీరు ప్రభువులు)

अमू + आसाते = अमू आसाते (వీరిద్దఱు ఉన్నారు)

12. ఒక్కటే అచ్చుగానుండు 'నిపాతము' (Interjection) ను, అంతమందు ఓ ఉండు నిపాతమును ప్రగృహ్యములు - అనఁగా సన్ధిలో మాఱవు.

(निपातएकाजनाङ् ; ओत्)

ఉదా:—इ+इन्द्र = इइन्द्र (ఓ ఇంద్రుఁడా !)

उ+उमेश = उउमेश (ఓ ఈశ్వరుఁడా !)

अहो+ईशाः = अहोईशाः (ఓహో, ప్రభువులారా !)

## II. హల్సన్ధి (హల్లులయొక్క సన్ధి)

1. 'स' కార 'त' వర్గములు 'श' కార 'च' వర్గములతో చేరినయెడల వానికి బదులు 'श' కార 'च' వర్గములు వచ్చును. ఎట్లనఁగా 'स' కారమునకు బదులు 'श'

కారము त, थ, द, ध, न లకు బదులు च, छ, ज, झ, ञలును వచ్చును. (स्तोश्चुनाश्चुः)

ఉదా:–कृष्णस्+शेते = कृष्णश्शेते (కృష్ణుఁడు నిద్రించు చున్నాఁడు)

रामस्+चिनोति = रामश्चिनोति (రాముఁడు ప్రోగుచేయు చున్నాఁడు)

सत्+चरित्रम् = सच्चरित्रम् (మంచినడత)

शार्ङ्गिन्+जय = शार्ङ्गिञ्जय (ఓ విష్ణువా! జయింపుము)

2. 'स' కార 'त' వర్గములు 'ष' కార 'ट' వర్గములతో చేరినయెడల వానికి బదులు 'ष' కార 'ट' వర్గములు వచ్చును. ఎట్లనఁగా—स కారమునకు బదులు ष కారమును, त, थ, द, ध, न లకు బదులు ट, ठ, ड, ढ, ण లును వచ్చును. (स्तोःष्टुना ष्टुः)

ఉదా:–पुत्रस्+षष्ठः = पुत्रष्षष्ठः (ఆఱవకొడుకు)

मित्रस्+टीकते = मित्रष्टीकते (మిత్రుఁడు ఉన్నాఁడు)

पेष्+ता = पेष्टा (తిరుగలి)

तत्+टीका = तट्टीका (దానికి టీక)

चक्रिन्+ढौकसे = चक्रिण्ढौकसे (ఓ విష్ణువా! నీవు పోవు చున్నావు)

3. హ్రస్వాచ్చుకు పరమైన 'छ' కారమునకు ద్విత్వము నిత్యముగా వచ్చును, అనఁగా దానికి ద్విత్వము, తప్పక వచ్చును. (छे च ह्रस्वस्य छेतुक्)

ఉదా:—शिव+छाया = शिवच्छाया (శివునియొక్క నీడ)

4. పదాన్తమందు దీర్ఘమగు అచ్చునకు छ కారము పర మైనయెడల దానికి च्छ కారము వైకల్పికముగ వచ్చును.

(पदान्ताद्वा)

ఉదా:—लक्ष्मी+छाया = लक्ष्मीच्छाया లేక लक्ष्मी छाया (లక్ష్మి యొక్క నీడ)

5. छ కారమునకు ముందు आ, मा అను ఉపసర్గలు ఉన్నపుడుకూడ దానికి ద్విత్వము నిత్యముగ వచ్చును.

(आङ्माङो एच)

ఉదా:—आ + छादितः = आच्छादितः (కప్పఁబడినవాఁడు లేక కప్పఁబడినది)

मा+छेदय = माच्छेदय (నఱుకవలదు)

6. ఒకపదము చివరనుండు ఏ హల్లునుగాని (అంతః స్థములకును అనునాసికములకును తప్ప) 'హాశ్శు' (Soft Consonant) గాని, అచ్చుగాని పరమయినయెడల దానివర్గ ములోని మూఁడవ అక్షరము దానికిబదులుగా వచ్చును.

(झलां जशोऽन्ते)

ఉదా:—तत्+भोगः = तद्भोगः (వాని భోగము)

द्विट्+घोषः = द्विड्घोषः (శత్రువుయొక్క ఘోష)

तत्+रागः = तद्रागः (ఆరాగము)

वाक्+ईशः = वागीशः (బృహస్పతి)

तत्+आगमनम् = तदागमनम् (వానిరాక)

7. పదాన్తమందుండు ఏ హల్లుకుగాని అనునాసికము పరమైనయెడల దానికిబదులు దాని వర్గములోని అనునాసికము వైకల్పికముగ వచ్చును. (यरोनुनासिकेऽनुनासिकोवा)

ఉదా:—एतत्+मुरारिः అనుదానికి एतन्मुरारिः ( = ఈవిష్ణువు) అనిగాని एतद्मुरारिः అనిగాని అగును. ఇట్లే षड्+मुखः= षण्मुखः (ఆఱుమొగములు గలవాఁడు లేక షణ్ముఖుఁడు), षड्मुखः అనియును, भवत्+महिमा=भवन्महिमा, भवद्महिमा అనియును అగును.

పరమగు అను నాసికము ఒక ప్రత్యయము (Termination) మొదట నుండెనేని ఈసన్ధినిత్యము అనఁగా తప్పక వచ్చును.

ఉదా:—तत्+मात्रम् =तन्मात्रम् (అదిమాత్రము; ఆమాత్రము)
चित्+मयम् = चिन्मयम् (జ్ఞానమువలన ఏర్పడినది)

8. 'त' వర్గాక్షరమునకు ల కారము పరమయినచో పూర్వపరములకు బదులు రెండవదాని సవర్ణము వచ్చును. (तोर्लि)

ఉదా:—तत्+लक्षणम् =तल्लक्षणम् (దానిలక్షణము)

विद्वान्+लिखति = विद्वाँल्लिखति (పండితుఁడు వ్రాయును) ఇచట 'न' కారమునకు మారుగా అనునాసిక ల కారము వచ్చును. ఈ 'ల' కారము అనునాసికమని తెలుపుటకు

దానిపైన అర్ధచన్ద్రాకారపు గుర్తు లేక చన్ద్రబిందువు ँ పెట్టఁబడును.

9. 'ఝల్లు'లకు 'ఖర్రు'లు (Surds లేక Hard Consonants) పరమయినపుడు వానికి బదులు 'చర్రు'లు వచ్చును.

(खरि झलां चरः स्युः)

'ఝల్లు' లనఁగా మాహేశ్వరసూత్రములలో తుది వర్ణములను విడిచి 'ఝ'కారమునకును కడపటి 'ల' కారమునకును నడుమనుండు వర్ణములు.

'ఖర్రు' లనఁగా 'ख' కారము మొదలు 'ष' కారము వఱకునుండు వర్ణములు.

'చర్రు' లనఁగా 'च' కారము మొదలు ष కారము వఱకునుండు వర్ణములు.

ఉదా:—उद्+स्थानम् = उत्थानम् (పైకిలేచుట)

उद्+स्तम्भनम् = उत्तम्भनम् (ప్రాపు)

10. 'ఝయ్'కు అనఁగా వర్గాక్షరములలోని మొదటి నాల్గింటిలో దేనికిఁగాని 'ह' కారము పరమయినచో దానికి బదులుగా దాని పూర్వవర్ణముయొక్క వర్గములోని నాల్గవ అక్షరము వైకల్పికముగ వచ్చును. (झयोहोऽन्यतरस्याम्)

ఉదా:—वाक्+हरिः = वाग्हरिः లేక वाग्घरिः (మాటలలో సింహము)

तत्+हयः = तद्हयः లేక तद्धयः (వానిగుఱ్ఱము)

11. 'श' కారమునకు ముందు వర్గాక్షరములలో మొదటి నాల్గింటియందు ఏదిగాని ఉండిదానికి అచ్చు, అంతఃస్థము, 'హ' కారము, అనునాసికము పరమయినచో అది ('श' కారము) వైకల్పికముగ छ కారమగును.

(शश्छोऽटि ; शश्छोऽमि)

ఉదా:—तत्+शिवः = तच् शिवः లేక तच्छिवः (ఆశివుఁడు)

सत्+शास्त्रम् = सच् शास्त्रम् లేక सच्छास्त्रम् (మంచిశాస్త్రము)

एतत्+श्रुतम् = एतच् श्रुतम् లేక एतच्छ्रुतम् (ఇది వేదము)

सम्यक्+श्लाघ्यः = सम्यच् श्लाघ्यः లేక सम्यच्छ्लाघ्यः

(చక్కఁగా శ్లాఘింపఁదగినవాఁడు)

12. పదాన్తమందుండు म् అను వర్ణము దానికి ఏఅచ్చు పరమయినను మార్పుచెందదు.

ఉదా:—तम् + आह्वय = तमाह्वय (వానిని పిలువుము)

अहम्+एव = अहमेव (నేనే)

13. పదాన్తమందుండు म् కు హల్లు పరమైనయెడల దానికి అనుస్వారము వైకల్పికముగా వచ్చును. श्, ष्, स्, ह्, र् లు పరమైనపుడు మాత్రము నిత్యము గావచ్చును.

(मोऽनुस्वारः)

ఉదా:—एनम्+सः = एनं सः (వీనిని వాఁడు)

धनम्+हरति=धनं हरति (ధనమును హరించుచున్నాఁడు)

सम्+रक्षति = संरक्षति (చక్కఁగా కాపాడును)

14. తక్కిన హల్లులకు ముందు తుది म् అనుస్వారముగ నైనను పరమయినహల్లుయొక్క వర్గములోని అను నాసికముగ నైనను మారును. य्, व्, ल् లు పరమైనచో వానికి బదులు అను నాసిక य्, व्, ल् లు వచ్చును. వీనిని यँ, वँ, लँ అని వ్రాయవలెను. (वापदान्तस्य)

ఉదా:—वयम्+कुर्मः = वयं कुर्मः లేక वयङ्कुर्मः (మేము లేక మనము చేయుచున్నాము)

त्वम्+च = त्वंच లేక त्वञ्च (నీవును)

सम्+प्राप्तिः = संप्राप्तिः లేక सम्प्राप्तिः (లెస్సగ పొందుట)

अहम्+युध्ये = अहं युध्ये లేక अहय्युँध्ये (యుద్ధము చేయుచున్నాను)

उत्तरम्+लिखसि=उत्तरं लिखसि లేక उत्तराँल्लिखसि (ఉత్తరము వ్రాయుచున్నావు)

हरिम्+वन्दे = हरिं वन्दे లేక हरिवँन्दे (హరినిగూర్చి లేక హరికి నమస్కరించుచున్నాను)

15. ఒకపదము చివర ङ्, ण्, न् లకుముందు హ్రస్వమగు అచ్చు ఉండి వానికి ఏ అచ్చుగాని పరమయినయెడల ద్విత్వము వచ్చును. (ङमो ह्रस्वादचि ङमुण्नित्यम्)

ఉదా:—प्रत्यङ्+आत्मा = प्रत्यङ्ङात्मा (స్పష్టముగనుండు ఆత్మ)

सुगण्+ईशः = सुगण्णीशः (శ్రేష్ఠమయిన సంఘమునకు అధిపతి)

हसन्+आगतः = हसन्नागतः (నవ్వుచు వచ్చెను)

16. పదాన్తమందుండు 'न्' కు 'ఛవ్' (छ, ठ, थ, च, ट, त) పరమయినయెడల వానికి బదులుగ అనుస్వార విసర్గములు వచ్చును. విసర్గ च, छ లకుముందు श గను, त, थ లకుముందు स గను, ट, ठ, లకు ముందు ष గను మారును.

ఉదా:—कस्मिन्+चित्रे = कस्मिंश्चित्रे (ఏచిత్రమునందు)

गुरून्+छात्रः = गुरूंश्छात्रः (గురువులను శిష్యుడు)

महान्+टङ्कः – महांष्टङ्कः (గొప్పగర్వము)

कान्+तरून् = कांस्तरून् ఏ చెట్లను ?)

కాని ఈసూత్రము प्रशान् (శాంతుఁడు) అనుపదమునందలి 'न्' కు మాత్రము చెల్లదు.

ఉదా:—प्रशान्+तनोति = प्रशान् तनोति (శాంతుఁడు వ్యాపింపఁజేయును) (नश्छव्यप्रशान्)

17. 'చ' వర్గపదాన్తమం దున్నపుడుగాని ఝల్ (అంతఃస్థములు, అనునాసికములుతప్ప తక్కినహల్లులు) పరమైనపుడుగాని 'క' వర్గగా మారును. (चोः कुः)

ఉదా:—वाच्+युक्तिः = वाग्युक्तिः (వాక్కుతో కూడిక)

सुयुज् – सुयुक् (గట్టిప్రయత్నము చేయువాఁడు)

18. రేఫమునకు రేఫము (र) పరమయినయెడల మొదటిరేఫమునకు లోపము కలుగును. అనఁగా అది వదలివేయఁ

బడును—దానికిముందుండు ऋ కు తప్ప 'अण्' కు అనగా
अ, इ, उ లకు దీర్ఘము వచ్చును.

(रोरि; ढ्लोपे पूर्वस्य दीर्घोऽणः)

ఉదా:—पुनर् + रमते = पुनारमते (మరల ఆడుచున్నాడు)

हरिर् + रम्यः = हरीरम्यः (విష్ణువు అందమైనవాడు)

शम्भुर् + राजते = शम्भूराजते (శివుడు ప్రకాశించు చున్నాడు)

19. ఒకటేపదమునందు ऋ, ॠ, र, ष లకు తర్వాత వచ్చునట్టి न् కు అచ్చుగాని न्, म्, य्, व् లుగాని పరమయి నపుడు అది (न्) ण् అగును. వీనికిని (ऋ, ॠ, र, ष లు) न् కును నడుమ అచ్చులు, क వర్గాక్షరములు, प వర్గాక్షరములు य, व, ह, అనుస్వారము ఉన్నపుడుకూడ ఇదేమార్పు కలుగును.

ఉదా:—भर्तृ+नाम् = भर्तृणाम् (భర్తలయొక్క)

पूर् + अनम् = पूरणम् (పూర్తిచేయుట; నిందించుట)

हरि+ना = हरिणा (హరిచేత)

गुरु+नाम् = गुरुणाम् (గురువులయొక్క)

राम+इन = रामेण (రామునిచేత)

द्वेष+इन = द्वेषेण (ద్వేషముచేత)

गृह्+नाति = गृह्णाति (తీసికొనును)

కాని आर्त+नाम् = आर्तानाम् (బాధపడువారియొక్క)

अर्थ+इन = अर्थेन (ధనముచేత)

అనియే అగును.

(ऋरषाभ्यां नोणः समानपदे ; अट्कुप्वाङ् नुम्व्यवायेऽपि)

20. न् కారము ऋ, र, ष లకుతర్వాత వచ్చినను ఒక పదముచివర ఉండెనేని దానికి ण కారము రాదు.

(नेपदान्तस्य)

ఉదా:—तरून् (చెట్లను)

21. ఒక ప్రత్యయములోని स् కు అచ్చు त వర్గాంతరము, स्, य्, व् లు పరముగా నున్నపుడు దానికిముందు अ, आ లు తప్ప మఱియే అచ్చుగాని, क्, र्, ल् లు గాని ఉండెనేని (వీనికిని स् కును నడుమ విసర్గ అనుస్వారముతో కూడిన వర్ణములు ఉన్ననుకూడ) ष् గా మారును. (इण्कोः)

ఉదా:—धेनु+सु = धेनुषु (ఆవులయందు)

दिक्+सु = दिक्षु = दिक्षु (దిక్కులయందు)

वच् + स्यति = वक्ष्यति (చెప్పుచున్నాఁడు)

ज्योतिस् + आ = ज्योतिषा (వెలుతురుచేత)

अर्चिः+सु = अर्चिःषु లేక अर्चिष्षु (జ్యోతులయందు)

चक्षुस् (కన్ను) ఇది ప్ర-బ-లో चक्षूंषि (కండ్లు) అగును.

हल्+सु = हल्षु (హల్లులయందు)

22. ఒకపదముచివర ఒకహల్లుకంటె ఎక్కువహల్లులు ఉన్నపుడు ముందుహల్లు తప్ప తక్కినవి వదలివేయఁబడును.

ఉదా:—कुभृत्+स् = कुभृत्स् = कुभृत् (పర్వతము)

23. పదాంత स् కారమునకు ఒకవర్ణము పరమైనను కాకపోయినను అది విసర్గ యగును.

ఉదా:—रामस् = रामः

24. పదాన్తమందు ర్ కు 'ఖర్రు' (Hard Consonants) పరమయినను కాకపోయినను అది విసర్గమగును.

(खरवसानयोर्विसर्जनीयः)

ఉదా:—पूर् = पूः (పట్టణము)

पुनर् + पुनर् = पुनः पुनः (మరల మరల)

25. పదాన్త స్ కారమునకు ముందు అ, ఆ లు తప్ప మఱియేఅచ్చుగాని ఉండి దానికి 'హశ్శు' (Soft Consonant) గాని అచ్చుగాని పరమయినయెడల అది ర్ కారముగ మారును. (ससजुषोरुः)

ఉదా:—कविस् + आगतः = कविरागतः (కవి వచ్చినాడు)

धेनुस् + गच्छति = धेनुर्गच्छति (ఆవు పోవుచున్నది)

26. ర్ కు ముందు అ కార మున్నపుడు దానికి అ కారముగాని 'హశ్శు' గాని పరమయినయెడల అది ఉ కార ముగ మారును. ఈ ఉ కారము దానికి ముందున్న అ కార ముతో చేరి గుణసన్ధివలన ఓ కార మగును.

(अतोरोरप्लुतादप्लुते ; हशिच)

ఉదా:—शिवर् + अर्च्यः = शिव+उ+अर्च्यः = शिवो+अर्च्यः= शिवोऽर्च्यः (శివుఁడు పూజింపఁదగినవాఁడు)

ఇట పూర్వసూత్రమువలన ఓ కారమునకు పరమయిన అ కారమునకు లోపము కలుగుటచే దానికి గుర్తుగా 'అవగ్రహము' - ऽ పెట్టఁబడినది. (అచ్ సన్ధి చూడుము)

ఉదా:—रामर् + वन्द्यः = राम+उ+वन्द्यः = रामो वन्द्यः

(రాముఁడు వంద్యుఁడు)

27. విసర్గకుముందు అ కారమును దానికిపరముగా అచ్చుగాని 'హశ్శు' గాని ఉన్నయెడల దానికి (ఆవిసర్గకు) లోపము కలుగును. ఈలోపము దానికిముందు అ కారమును పరముగా అ కారముతప్ప మఱియే అచ్చుగాని ఉన్నపుడు కూడ కలుగును.

ఉదా:—बुधाः+आगताः=बुधा आगताः (పెద్దలు వచ్చినారు)

नराः+इमे = नरा इमे (వీరు మనుష్యులు)

जनाः+वदन्ति = जना वदन्ति (జనులు చెప్పుదురు)

नृपः+उपदिशति = नृपउपदिशति (రాజు ఉపదేశించుచున్నాఁడు)

ఇటవిసర్గలోపమువలన ఎదురైన అచ్చులకు సన్ధిరాదు.

(लोपः शाकल्यस्य)

28. విసర్గకు श्, ष्, स् లు పరమయినయెడల దానికి వైకల్పికముగ श्, ष्, स् లు వచ్చును. (वाशरि)

ఉదా:—हरिः+शेते = हरिःशेते లేక हरिश्शेते (హరి నిద్రించుచున్నాఁడు)

रामः+षष्ठः = रामःषष्ठः లేక रामष्षष्ठः (రాముఁడు ఆఱవవాఁడు)

हरिः+स्वामी = हरिःस्वामी లేక हरिस्स्वामी (హరిఅధికారి)

29. విసర్గకు 'ఖర్రు' పరమయినయెడల దానికి బదులు स् వచ్చును.

ఉదా:—विष्णुः+त्राता = विष्णुस्त्राता (విష్ణువు కాపాడువాఁడు)

పరమయిన 'ఖర్రు'తో శ్, ష్, స్ లు చేరి వచ్చినపుడు ఈ మార్పుకలుగదు.

ఉదా:—कः+क्षमः = कःक्षमः (ఎవఁడు సమర్థుఁడు ?

(शर्परे विसर्जनीयः

30. भोः, भगोः, अघोः లేక अ, आ లు పూర్వమందుండు విసర్గకు అచ్చుగాని, 'హశ్శు' గాని పరమైనయెడల దానికి య్ ఆదేశముగవచ్చును. ఈ య్ అచ్చులకుముందు వైకల్పికముగను హల్లులకు ముందు నిత్యముగను లోపించును. ఈలోపమువలన ఎదురైన అచ్చులకు సన్ధి రాదు.

(भो भगो अघो अपूर्वस्य योऽशि; ओतो गार्ग्यस्य; लोपः शाकल्यस्य ; हलिसर्वेषाम् )

भोः, भगोः, अघोः అనునవి స్ కారాన్తములగు నిపాతములు (Interjections)

ఉదా:—देवाः+इह = देवा इह లేక देवा यिह (దేవతలు ఇచట)

भोः+देवाः = भो देवाः (ఓ దేవతలారా !)

भगोः+नमस्ते = भगो नमस्ते (ఓహో, నీకునమస్కారము)

अघोः+एहि = अघो एहि లేక अघो येहि (ఆహా, రమ్ము)

31. सः, एषः అను శబ్దములయందలి విసర్గ హల్లుకు ముందు లోపించును.

(एतत्तदोः सुलोपोऽकोरनञ्समासे हलि)

ఉదా:—एषः विष्णुः = एष विष्णुः (ఇతఁడు విష్ణువు)

सः+शम्भुः = सशम्भुः (అతఁడు శివుఁడు)

# అధ్యాయము. ౪.

## శబ్దప్రకరణము.

### సాధారణశబ్దములు.

1. పదార్థవాచకములగు నామముల (nouns) కు పుంలిఙ్గము (Masculine Gender), స్త్రీ లిఙ్గము (Feminine Gender), నపుంసకలిఙ్గము (Neuter Gender) అని మూఁడు లిఙ్గములును, ఏకవచనము (Singular Number), ద్వివచనము (Dual Number), బహువచనము (Plural Number) అని మూఁడు వచనములును కలవు.

పుం లిఙ్గమనఁగా పురుషపర్యాయముగ వాఁడఁబడునది: ఉదా:—राम, तरु (చెట్టు). స్త్రీ లిఙ్గమనఁగా స్త్రీపర్యాయముగ వాఁడఁబడునది. ఉ:—गौरी (పార్వతి), पृथिवी (భూమి). నపుంసక లిఙ్గమనఁగా ప్రాణము లేనివస్తువులను చెప్పునపుడు వాఁడఁబడునది. ఉదా:—मनः (మనస్సు), पुस्तकम् (పుస్తకము). ఏకవచనము ఒకటే వస్తువును తెలుపును. ఉదా:—रामः (ఒక రాముఁడు) ద్వివచనము రెండువస్తువులను తెలుపును. ఉదా: रामौ (ఇద్దఱు రాములు). బహువచనము పెక్కువస్తువులను తెలుపును. ఉదా:—रामाः (బహురాములు).

2. శబ్దములకు అన్తములు (Endings) వేర్వేఱుగ నుండును. అన్నియు ఒకటే అన్తము కలవిగనుండవు. కొన్ని अ కారాన్తములుగను, కొన్ని इ కారాన్తములుగను, కొన్ని

త కారాన్తములుగను పలువిధములుగ నుండును. ఉదా:-
राम-अ కారాన్తము, हरि-इ కారాన్తము, शम्भु-उ కారాన్తమ
पितृ (తండ్రి) ऋ కారాన్తము.

3. తెనుగునందు వలెనే సంస్కృతమునందును ఎని
విభక్తులు (Cases) కలవు. ఇవి ప్రథమా (Nominative)
బోధన ప్రథమా (Vocative), ద్వితీయా (Accussativ
తృతీయా (Instrumental), చతుర్థి (Dative), పఞ్చమి
(Ablative), షష్ఠీ (Genitive), సప్తమీ (Locative) అ
నవి.

4. పుంలిఙ్గ స్త్రీ లిఙ్గశబ్దములకు విభక్తు లేర్పడుట
ప్రకృతి (మొదటి రూపము—base)కి చేర్పఁబడు ప్రత్య
ము లేవియనఁగా.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| Nom. case ప్రథమావిభక్తి | स् (:) | औ | अस् (अ:) |
| Accus. case ద్వితీయావిభక్తి | अम् | ,, | ,, (अ:) |
| Instr. case తృతీయావిభక్తి | आ | भ्याम् | भिस् (भि:) |
| Dative case చతుర్థీ విభక్తి | ए | ,, | भ्यस् (भ्य:) |
| Ablative case పఞ్చమీవిభక్తి | अस् (अ:) | ,, | ,, (भ्य:) |

| | | | |
|---|---|---|---|
| Genitive case షష్ఠీవిభక్తి | अस् (अः) | ओस् (ओः) | आम् |
| Locative case సప్తమీవిభక్తి | इ | „ (ओः) | सु |

5. ప్రథమైకవచన ప్రత్యయము హల్లులు అన్తము నందుఁగల ప్రకృతుల (bases) చివరలోపించును. సంబోధన ప్రథమావిభక్తి సామాన్యముగ ప్రథమవలెనే ఉండును. నపుంసకశబ్దములకుకూడ పైనచెప్పిన ప్రత్యయములే సామాన్యముగ చేర్పఁబడును. మార్పులాయాచోట్ల తెలుపఁబడును.

6. పైనచెప్పిన ప్రత్యయములు అజన్త (అచ్చులు అన్తమందుఁగల) ప్రకృతులకు చేర్పఁబడినపుడు వానికనేక మార్పులు కలుగును.

## అజన్తములు.

### (1) अ కారాన్త పుంలిఙ్గప్రత్యయములు.

| విభక్తులు | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్రథమావిభక్తి | स् | औ | अस् |
| ద్వితీయావిభక్తి | म् | औ | आन् |
| తృతీయావిభక్తి | इन | भ्याम् | ऐस् |
| చతుర్థీవిభక్తి | य | „ | भ्यस् |
| పఞ్చమీవిభక్తి | अत् | „ | „ |
| షష్ఠీవిభక్తి | स्य | ओस् | नाम् |
| సప్తమీవిభక్తి | इ | „ | सु |

అ కారాన్త శబ్దములకు సంబోధన ప్రథమైక వచనములో ప్రకృతిరూపమే ఉండును. తక్కిన వచనములు ప్రథమకువలెనే.

ఉదా:—(हे) गज (हे) गजौ (हे) गजाः. 'नाम्' అను ప్రత్యయమునకు ముందుండు హ్రస్వాచ్చు దీర్ఘమగును. ఉదా:—गज+नाम् = गजानाम्. తుది అ కారము ओस् కును षु కును ముందు ए అగును. ఉదా:—गज+ओस् = गजे+ओस् = गजयोः (సం. సూ. చూ.) गज+षु = गजे+षु = गजेषु.

అ కారాన్త పుంలిఙ్గ राम (రాముడు) శబ్దము.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | रामः | रामौ | रामाः |
| సం. ప్ర. | (हे) राम | (हे) ,, | (हे) ,, |
| ద్వి. | रामम् | रामौ | रामान् |
| తృ. | रामेण | रामाभ्याम् | रामैः |
| చ. | रामाय | ,, | रामेभ्यः |
| పం. | रामात् | ,, | ,, |
| ష. | रामस्य | रामयोः | रामाणाम् |
| స. | रामे | ,, | रामेषु |

ఇట పదాన్త स् కారము విసర్గయగును.

राम+स् = रामस् = रामः ; राम + औ = रामौ. राम+आस्=रामाः. राम+आन् = रामान्. राम+इन = रामेन (గుణసన్ధి) न కారము ण కారమగుటచేత (సం. సూ. చూ.) रामेण అగును.

राम+ऐस् = रामैः (వృద్ధిసన్ధి) य, भ्याम् లకుముందు अ కారము దీర్ఘముగను, भ्यस् కుముందు ए గనుమారును. ఇట్లు रामाय, रामाभ्याम्, रामेभ्यः అగును.

राम + अत् = रामात्

राम+ओस् = रामयोः } ముందుచెప్పిన गजयोः,

राम+नाम् = रामानाम् } गजानाम् వలెనేకాని न కార మునకు ण కారమువచ్చుటచేత (సం. సూ. చూ) रामाणाम् అగును.

राम+इ = रामे (గుణసన్ధి)

रामे+सु = रामे+षु = रामेषु (गजेषु వలెనే)

2. आ కారాన్త స్త్రీలిఙ్గ ప్రత్యయములు.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | లేదు | ई | अस् |
| ద్వి. | आम् | ई | अस् |
| తృ. | आ | भ्याम् | भिस् |
| చ. | ए | भ्याम् | भ्यस् |
| పం. | अस् | भ्याम् | भ्यस् |
| ష. | अस् | ओस् | नाम् |
| స. | आम् | ,, | सु |

సంబోధన ప్రథమైకవచనములో శబ్దము తుదనుండు आ, ए అగును. తక్కిన వచనములు ప్రథమవలెనే.

3

### ఆ కారాన్తస్త్రీలిఙ్గ रमा (లక్ష్మి) శబ్దము.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | रमा | रमे | रमाः |
| సం. ప్ర. | (हे)रमे | (हे) रमे | हे (रमाः) |
| ద్వి. | रमाम् | रमे | रमाः |
| తృ. | रमया | रमाभ्याम् | रमाभिः |
| చ. | रमायै | ,, | रमाभ्यः |
| పం. | रमायाः | ,, | ,, |
| ష. | ,, | रमयोः | रमाणाम् |
| స. | रमायाम् | ,, | रमासु |

శబ్దాన్తమందుండు आ తృతీయైకవచనములో ए గ మారును. చతుర్థి మొదలగు తక్కిన విభక్తుల యేకవచనములందు ప్రత్యయములకు ముందు या అను అగమము వచ్చును. ఇట్లు తృతీయలో रमा + आ = रमे + आ లేక रमया.

చతుర్థి. रमा + या + ए = रमायै

పఞ్చమి. रमा + या + अस् = रमायाः

షష్ఠి. रमा + या + अस् = रमायाः

సప్తమి. रमा + या + आम् = रमायाम्

షష్ఠీ సప్తమీ ద్వివచనములందు తుది आ కారము ప్రత్యయములకు ముందు ए అగును. रमा + ओस् = रमे + ओस् లేక रमयोः

(3) అ కారాన్తనపుంసకలిఙ్గ ప్రత్యయములు.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్రథమా. | म् | ई | आनि |
| ద్వితీయా. | म् | ई | आनि |

ఇవి తప్ప తక్కిన విభక్తి ప్రత్యయములన్నియు పుంలిఙ్గమునకువలెనే ఉండును. సంబోధన ప్రథమైకవచనములో మాత్రము అ కారాన్త పుంలిఙ్గశబ్దములకు వలెనే ప్రకృతి రూపము ఉండును. మిగిలినవచనములు ప్రథమలోవలెనే.

అ కారాన్త నపుంసకలిఙ్గ ज्ञान (తెలివి) శబ్దము.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | ज्ञानम् | ज्ञाने | ज्ञानानि |
| సం. ప్ర. | (हे) ज्ञान | (हे) ज्ञाने | (हे) ज्ञानानि |
| ద్వి. | ज्ञानम् | ज्ञाने | ज्ञानानि |

ज्ञान + ई = ज्ञाने (గుణసన్ధి) ज्ञान + आनि = ज्ञानानि (సవర్ణదీర్ఘసన్ధి)

తక్కినవిభక్తులు राम శబ్దమునకువలెనే ఏర్పడును. తృతీయలోను షష్ఠిలోను न् కారము ण् కారము కాదు. కాబట్టి ज्ञानेन, ज्ञानानाम् అని వచ్చును.

(4) ఇ కారాన్తపుంలిఙ్గ ప్రత్యయములు.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | स् | — | अस् |
| ద్వి. | म् | — | न् |
| తృ. | ना | भ्याम् | भिस् |
| చ. | ए | भ्याम् | भ्यस् |
| పం. | अस् | ,, | ,, |
| ష. | ,, | ओस् | नाम् |
| స. | औ | ,, | सु |

(క) సంబోధన ప్రథమైక వచనమునందు ఇ కారము ఏ కారమగును. ఉదా—(हे) हरे

(ఖ) ప్రథమా, సం. ప్ర., ద్వితీయా విభక్తులందుం ఇ కారమునకు బహువచన अस् కు ముందు గుణమును, ద్వి చనమందు బహువచన न् కు ముందు దీర్ఘమును వచ్చును.

ఉదా:—गिरी (ద్వివచనము) गिरि + अस् = गिरे + अ

లేక गिरयः (సన్ధిమా

गिरीन् (ద్వితీయాబహువచనము)

(గ) పుంలిఙ్గశబ్దముల తుదనుండు ఇ కారమునకు చ ర్థీ, పఞ్చమీ, షష్ఠ్యేకవచన ప్రత్యయములకు ముందుగుణ వచ్చును.

(ఘ) పఞ్చమీ షష్ఠ్యేకవచనములందు अस् లోని अ కారము లోపించును.

(జ) సప్తమ్యేకవచనమునందు औ కు ముందు శబ్దము చివరనుండు इ కారమునకు లోపము కలుగును.

इ కారాన్తపుంలిఙ్గ गिरि (కొండ) శబ్దము.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | गिरिः | गिरी | गिरयः |
| సం. ప్ర. | (हे) गिरे | (हे) गिरी | (हे) गिरयः |
| ద్వి. | गिरिम् | गिरी | गिरीन् |
| తృ. | गिरिणा | गिरिभ्याम् | गिरिभिः |
| చ. | गिरये | ,, | गिरिभ्यः |
| పం. | गिरेः | ,, | ,, |
| ష. | ,, | गिर्योः | गिरीणाम् |
| స. | गिरौ | ,, | गिरिषु |

ప్ర. 1. गिरि + अस् = गिरे + अस् లేక गिरयः (సన్ధి-పైన 'क' సూ. చూ.)

తృ. 2. गिरि + ना = गिरिणा (సన్ధి)

చ. 3. गिरि + ए = गिरे + ए లేక गिरये (పైన 'ग' సూ. చూ.)

(1) సంబోధనప్రథమలో ఏకవచనమునందు సామాన్యముగా ఈ కారముహ్రస్వమగును. తక్కిన వచనములు ప్రథమకువలెనే.—श्री, धी శబ్దములు చూడుము.

(2) చతుర్థి మొదలు తక్కినవిభక్తులయందు ఏకవచన ప్రత్యయములకుముందు आ అను ఆగమమువచ్చును.

(3) సప్తమీ బహువచములో सु అనునది षु అగును.

ఈ కారాన్తస్త్రీలిఙ్గ गौरी (పార్వతి) శబ్దము.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | गौरी | गौर्यौ | गौर्यः |
| సం. ప్ర. | (हे) गौरि | (हे) गौर्यौ | (हे) गौर्यः |
| ద్వి. | गौरीम् | गौर्यौ | गौरीः |
| తృ. | गौर्या | गौरीभ्याम् | गौरीभिः |
| చ. | गौर्यै | ,, | गौरीभ्यः |
| పం. | गौर्याः | ,, | ,, |
| ష. | ,, | गौर्योः | गौरीणाम् |
| స. | गौर्याम् | ,, | गौरीषु |

చ. गौरी + आ + ए = गौर्यै

పం, ష. गौरी + आ + अस् = गौर्याः

స. गौरी + आ + आम् = गौर्याम्

गौरी + सु = गौरीषु

7. इ కారాన్తనపుంసకలిఙ్గప్రత్యయములు.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | — | ई | इ |
| ద్వి. | — | ई | इ |
| తృ. | आ | भ्याम् | भिस् |
| చ. | ए | ,, | भ्यस् |
| పం. | अस् | ,, | ,, |
| ష. | ,, | ओस् | नाम् |
| స. | इ | ,, | सु |

(1) సం. ప్ర. లో శబ్దముతుదనుండు इ కారము ए కారముగ కూడమారును.

(2) అచ్చు మొదటనుండు ప్రత్యయములకు ముందు न् చేర్పఁబడును.

(3) ప్రథమా ద్వితీయా బహువచనములకు ముందు इ కారము దీర్ఘమగును.

(4) इ కారాన్తశబ్దములు కొన్ని పుంలిఙ్గమునందును, నపుంసక లిఙ్గమునందునుకూడ ఒకటే అర్థమునందు వచ్చును. వీనిని "భాషితపుంస్కములు" అందురు. తక్కిన వానిని "అభాషితపుంస్కములు" అందురు. शुचि శబ్దము భాషితపుంస్కము, वारि శబ్దము కాదు. పుంలిఙ్గమునందు शुचिः, शुची, शुचयः అనియును, నపుంసకలిఙ్గమునందు शुचि, शुचिनी, शुचीनि అనియును ఉండును.

## ఇకారాన్త నపుంసకలిఙ్గ वारि (నీళ్లు) శబ్దము.

(అభాషితపుంస్కము)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | वारि | वारिणी | वारीणि |
| సం. ప్ర. | (हे) वारे<br>(हे) वारि | (हे) ,, | (हे) ,, |
| ద్వి. | वारि | वारिणी | वारीणि |
| తృ. | वारिणा | वारिभ्याम् | वारिभिः |
| చ. | वारिणे | ,, | वारिभ्यः |
| పం. | वारिणः | ,, | ,, |
| ష. | ,, | वारिणोः | वारीणाम् |
| స. | वारिणि | ,, | वारिषु |

## ఇకారాన్తనపుంసకలిఙ్గ शुचि శబ్దము (శుద్ధమైనది)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | शुचि | शुचिनी | शुचीनि |
| సం. ప్ర. | (हे) शुचे<br>(हे) शुचि | (हे) ,, | (हे) ,, |
| ద్వి. | शुचि | शुचिनी | शुचीनि |
| తృ. | शुचिना | शुचिभ्याम् | शुचिभिः |
| చ. | शुचिने<br>शुचये | ,, | शुचिभ्यः |

| | | | |
|---|---|---|---|
| పం. | शुचिनः<br>शुचेः | शुचिभ्याम् | शुचिभ्यः |
| ష. | शुचिनः<br>शुचेः | शुचिनोः<br>शुच्योः | शुचीनाम् |
| స. | शुचिनि<br>शुचौ | शुचिनोः<br>शुच्योः | शुचिषु |

ఉకారాన్తశబ్దములు.

(1) వీని విభక్తులలో ఇకారాన్త శబ్దములయందలి ఇ.ఈ ఏ య్ లకు బదులు క్రమముగా ఉ ఊ ఓ వ్ లువచ్చును.

(2) పుంలిఙ్గ శబ్దముల చివరనుండు ఉ కారమునకు చతుర్థీ, పఞ్చమీ, షష్ఠ్యేకవచనములందు గుణమువచ్చును. కావున विष्णवे, विष्णोः అని ఏర్పడును.

(3) మూఁడు లిఙ్గములయందును వీని విభక్తులుకూడ ఇకారాన్తముల విభక్తులవలెనే ఏర్పడును. కాని చతుర్థీ, పఞ్చమీ, షష్ఠీ. సప్తమ్యేకవచనములందును, నపుంసక లిఙ్గషష్ఠీ, సప్తమీ ద్వివచనములందును వీనికి ఆయావిభక్తుల పుంలిఙ్గ రూపములు కూడవచ్చును.

ఉకారాన్త పుంలిఙ్గ विष्णु (విష్ణువు) శబ్దము.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | विष्णुः | विष्णू | विष्णवः |
| సం. ప్ర. | (हे) विष्णो | (हे) विष्णू | (हे) विष्णवः |
| ద్వి. | विष्णुम् | विष्णू | विष्णून् |

| | | | |
|---|---|---|---|
| తృ. | विष्णुना | विष्णुभ्याम् | विष्णुभिः |
| చ. | विष्णवे | ,, | विष्णुभ्यः |
| పం. | विष्णोः | ,, | विष्णुभ्यः |
| ష. | ,, | विष्णवोः | विष्णूनाम् |
| స. | विष्णौ | ,, | विष्णुषु |

ఉకారాన్తస్త్రీలిఙ్గ तनु (దేహము) శబ్దము.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | तनुः | तनू | तनवः |
| సం. ప్ర. | (हे) तनो | (हे) तनू | (हे) तनवः |
| ద్వి. | तनुम् | तनू | तनूः |
| తృ. | तन्वा | तनुभ्याम् | तनुभिः |
| చ. | तन्वै / तनवे | ,, | तनुभ्यः |
| పం. | तन्वाः / तनोः | ,, | ,, |
| ష. | तन्वाः / तनोः | तन्वोः | तनूनाम् |
| స. | तन्वाम् / तनौ | तन्वोः | तनुषु |

(1) దీనికి తృతీయైకవచన ప్రత్యయము आ ద్వితీయా బహువచన ప్రత్యయమగు स् కు ముందు తుది అచ్చుదీర్ఘమగును. तनु + आ = तन्वा, तनु + स् = तनूः— కడపటి

నాలుగు విభక్తులయందు ఏకవచనములో तन्वै, तन्वाः, तन्वाम् అనురూపములు వైకల్పికముగా వచ్చును.

(2) నపుంసక ఉకారాన్తశబ్దముల విభక్తులు ఏర్పడుటకుకూడ పుంలిఙ్గశబ్దములకు చెప్పినపద్ధతి యే పనికివచ్చును.

ఉకారాన్త నపుంసకలిఙ్గ मधु (తేనె) శబ్దము.

(అభాషితపుంస్కము)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | मधु | मधुनी | मधूनि |
| సం. ప్ర. | (हे) मधो<br>(हे) मधु | (हे) ,, | (हे) ,, |
| ద్వి. | मधु | मधुनी | मधूनि |
| తృ. | मधुना | मधुभ्याम् | मधुभिः |
| చ. | मधुने | ,, | मधुभ्यः |
| ప. | मधुनः | ,, | ,, |
| ష. | ,, | मधुनोः | मधूनाम् |
| స. | मधुनि | ,, | मधुषु |

ఉకారాన్తనపుంసకలిఙ్గ मृदु (మెత్తనిది) శబ్దము

(భాషితపుంస్కము)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | मृदु | मृदुनी | मृदूनि |
| సం. | (हे) मृदो<br>(हे) मृदु | (हे) ,, | (हे) ,, |

| | | | |
|---|---|---|---|
| ద్వి. | मृदु | मृदुनी | मृदूनि |
| తృ. | मृदुना | मृदुभ्याम् | मृदुभिः |
| చ. | मृदुने / मृदवे | ,, | मृदुभ्यः |
| పం. | मृदुनः / मृदोः | ,, | मृदुभ्यः |
| ష. | मृदुनः / मृदोः | मृदुनोः / मृद्वोः | मृदूनाम् |
| స. | मृदुनि / मृदौ | मृदुनोः / मृद्वोः | मृदुषु |

ఊ కారాన్తస్త్రీలిఙ్గ वधू (ఆడుది) శబ్దము.

ఈ కారాన్తస్త్రీలిఙ్గ శబ్దములలోని इ ई ए లను उ ऊ व లుగా మార్చినయెడల ఈశబ్దముయొక్క రూపము లేర్పడును. దీనికి ప్రథమైకవచన ప్రత్యయము स्.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | वधूः | वध्वौ | वध्वः |
| సం. ప్ర. | (हे) वधु | (हे) वध्वौ | (हे) वध्वः |
| ద్వి. | वधूम् | वध्वौ | वधूः |
| తృ. | वध्वा | वधूभ्याम् | वधूभिः |
| చ. | वध्वै | ,, | वधूभ्यः |
| పం. | वध्वाः | ,, | ,, |
| ష. | ,, | वध्वोः | वधूनाम् |
| స. | वध्वाम् | ,, | वधूषु |

## ఋ కారాన్తపుంలిఙ్గశబ్దములు.

(1) వీనిలో ప్రత్యయములకుముందు ప్రథమా విభక్తిలోను ద్వితీయైకవచన, ద్వివచనములయందును అంతమందుండు 'ऋ' आर् గామారును. पितृ, मातृ, भ्रातृ మొదలగు కొన్నిశబ్దములయందు మాత్రము ऋ అనునది अर् అగును. ప్రథమైకవచనములో र् కారమునకును स् అను ప్రత్యయమునకును లోపముకలుగుటచే అంతమందు आ మాత్రము నిలుచును.

వీని ప్రత్యయములు:—

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | स् | औ | अस् |

సం. ప్ర. లో ఏకవచనమునందు अर् లోని र् లోపించుటచేత अः అగును (సం. సూ. చూ.)

| | | | |
|---|---|---|---|
| ద్వి. | अम् | औ | न् |

न् కుముందు ऋ దీర్ఘమగును.

| | | | |
|---|---|---|---|
| తృ. | आ | भ्याम् | भिस् |
| చ. | ए | ,, | भ्यस् |
| పం. | లేదు | ,, | ,, |
| ష. | లేదు | ओस् | नाम् |
| స. | इ | ,, | सु |

(2) పఞ్చమీషష్ఠీ విభక్తులఏకవచనములో 'ऋ' उर्

గామారును. సప్తమ్యేకవచనమందలి ఇ కారమునకు ముందు ఇది అర్ అగును. నామ్ కుముందు ఋ కారము దీర్ఘమగును.

ఋ కారాన్తపుంలిఙ్గ धातृ (బ్రహ్మ) శబ్దము.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | धाता | धातारौ | धातारः |
| సం. ప్ర. | (हे) धातः | (हे) धातारौ | (हे) धातारः |
| ద్వి. | धातारम् | धातारौ | धातॄन् |
| తృ. | धात्रा | धातृभ्याम् | धातृभिः |
| చ. | धात्रे | ,, | धातृभ्यः |
| పం. | धातुः | ,, | ,, |
| ష. | ,, | धात्रोः | धातॄणाम् |
| స. | धातरि | ,, | धातृषु |

ఋ కారాన్తపుంలిఙ్గ पितृ (తండ్రి) శబ్దము.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | पिता | पितरौ | पितरः |
| సం. ప్ర. | (हे) पितः | (हे) पितरौ | (हे) पितरः |
| ద్వి. | पितरं | पितरौ | पितॄन् |
| తృ. | पित्रा | पितृभ्याम् | पितृभिः |
| చ. | पित्रे | ,, | पितृभ्यः |
| పం. | पितुः | ,, | ,, |
| ష. | ,, | पित्रोः | पितॄणाम् |
| స. | पितरि | ,, | पितृषु |

ఋ కారాన్త పుంలిఙ్గ నృ (నరుఁడు) శబ్దము.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | ना | नरौ | नरः |
| సం. ప్ర. | (हे) नः | (हे) नरौ | (हे) नरः |
| ద్వి. | नरम् | नरौ | नॄन् |
| తృ. | त्रा | नृभ्याम् | नृभिः |
| చ. | त्रे | ,, | नृभ्यः |
| పం. | नुः | ,, | नृभ्यः |
| ష. | ,, | त्रोः | नृणाम् / नॄणाम् |
| స. | नरि | ,, | नृषु |

ఈ శబ్దములో నామ్ కు ముందు దీర్ఘము వైకల్పికము. షష్ఠీ బహువచనములో नृणाम्, नॄणाम् అని రెండురూపములు వచ్చును.

బంధుత్వార్థకములగు स्वसृ, मातृ, दुहितृ, यातृ మొదలగు ఋ కారాన్త స్త్రీలిఙ్గముల ద్వితీయా బహువచన ప్రత్యయము स्.

దీనికి ముందువీని ఋ కారము దీర్ఘమగును.

ఉదా:—स्वसॄः, मातॄः, दुहितॄः మొ.

**स्वसृ** (ఆఁడుతోఁడఁబుట్టువు) శబ్దము మాత్రము తక్కినవిభక్తులలో **नप्तृ** (మనుమఁడు) శబ్దమువలెనే చెప్పఁబడును. మిగిలినవి पितृ శబ్దమువలెనే. ఉదా:—दुहिता दुहितरौ दुहितरः మొ.

(1) ఋ కారాన్తపుంలిఙ్గ नप्तृ (మనుమఁడు) శబ్దము

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | नप्ता | नप्तारौ | नप्तारः |
| సం. ప్ర. | (हे) नप्तः | (हे) नप्तारौ | (हे) नप्तारः |
| ద్వి. | नप्तारम् | नप्तारौ | नप्तॄन् |

(2) ఋ కారాన్తస్త్రీలిఙ్గ स्वसृ (అఁడుతోఁడఁబుట్టువు) శబ్దము.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | स्वसा | स्वसारौ | स्वसारः |
| సం. ప్ర. | (हे) स्वसः | (हे) स्वसारौ | (हे) स्वसारः |
| ద్వి. | स्वसारम् | स्वसारौ | स्वसॄः |

తక్కినవిభక్తులు రెంటికిని సమానము. శేషము, పి[illegible] శబ్దమువలెనే.

(3) ఋ కారాన్తస్త్రీలిఙ్గ मातृ (తల్లి) శబ్దము.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | माता | मातरौ | मातरः |
| సం. ప్ర. | (हे) मातः | (हे) मातरौ | (हे) मातरः |
| ద్వి. | मातरम् | मातरौ | मातॄः |

శేషము पितृ శబ్దమువలె.

(4) ఋ కారాన్త స్త్రీలిఙ్గ यातृ (తోడికోడలు, అత్త) శబ్దము.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | याता | यातरौ | यातरः |
| సం. ప్ర. | (हे) यातः | (हे) यातरौ | (हे) यातरः |
| ద్వి. | यातरम् | यातरौ | यातॄः |

శేషము पितृ శబ్దమువలె.

ఋ కారాన్త నపుంసలిఙ్గ శబ్దములు ఈ దిగువ చూపఁబడిన శబ్దమువలెనే చెప్పఁబడును.

ఋ కారాన్త నపుంసకలిఙ్గ कर्तृ (చేయునది) శబ్దము.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | कर्तृ | कर्तृणी | कर्तॄणि |
| సం. ప్ర. | (हे) कर्तॄ / (हे) कर्तः | (हे) ,, | (हे) ,, |
| ద్వి. | कर्तृ | कर्तृणी | कर्तॄणि |
| తృ. | कर्तृणा / कर्त्रा | कर्तृभ्याम् | कर्तृभिः |
| చ. | कर्तृणे / कर्त्रे | ,, | कर्तृभ्यः |
| పం. | कर्तृणः / कर्तुः | ,, | ,, |
| ష. | | कर्तृणोः / कर्त्रोः | कर्तॄणाम् |

| | | | |
|---|---|---|---|
| స. | कर्त्रणि<br>कर्तरि | ,, | कर्तृषु |

ఇంతమట్టుకు అజన్తశబ్దముల విషయము చెప్పఁబడినది.

## (ii) హలన్త శబ్దములు.

(1) వీనికి సామాన్యముగా చేర్పఁబడు విభక్తి ప్రత్యయములు.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర., సం. ప్ర. | स् | औ | आस् |

మొదలగునవి ఇంతకుముందే చెప్పఁబడినవి (వానిని చూడుము.) పుంలిఙ్గ స్త్రీలిఙ్గ హలన్తశబ్దములకు వీనిని చేర్చినపుడు వానికి ఎట్టిమార్పును కలుగదు. శబ్దప్రకృతిలో మాత్రము కొన్ని భేదములు కలుగును. కొన్ని పుంలిఙ్గ స్త్రీలిఙ్గశబ్దములు మార్పుఁజెందక రూపములో ఒకటే విధముగా ఉండును.

ఉదా:—इन्द्रजित् (పుం.) ఇన్ద్రజిత్తు.

दिविषद् (పుం.)—దేవత, मुद् (స్త్రీ) (సంతోషము) మొ॥

त కారాన్త పుంలిఙ్గ इन्द्रजित् (ఇంద్రజిత్తు) శబ్దము.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | इन्द्रजित् | इन्द्रजितौ | इन्द्रजितः |
| సం. ప్ర. | (हे) ,, | (हे) ,, | (हे) ,, |
| ద్వి. | इन्द्रजितम् | इन्द्रजितौ | इन्द्रजितः |
| తృ. | —जिता | —जिद्भ्याम् | —जिद्भिः |

| | | | |
|---|---|---|---|
| చ. | —जिते | ,, | —जिद्भ्यः |
| పం. | —जितः | ,, | ,, |
| ష. | ,, | —जितोः | —जिताम् |
| స. | —जिति | ,, | —जित्सु |

द కారాన్త పుంలిఙ్గ दिविषद् (దేవత) శబ్దము.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | दिविषत् | दिविषदौ | दिविषदः |
| సం. ప్ర. | (हे) दिविषत् | (हे) दिविषदौ | (हे) दिविषदः |
| ద్వి. | दिविषदम् | दिविषदौ | दिविषदः |
| తృ. | —षदा | —षद्भ्याम् | —षद्भिः |
| చ. | —षदे | ,, | —षद्भ्यः |
| పం. | —षदः | ,, | ,, |
| ష. | — ,, | —षदोः | —षदाम् |
| స. | —षदि | ,, | —षत्सु |

श కారాన్త స్త్రీలిఙ్గ दिक् (దిక్కు) శబ్దము.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | दिक् | दिशौ | दिशः |
| సం. ప్ర. | (हे) दिक् | (हे) दिशौ | (हे) दिशः |
| ద్వి. | दिशम् | दिशौ | दिशः |
| తృ. | दिशा | दिग्भ्याम् | दिग्भिः |
| చ. | दिशे | ,, | दिग्भ्यः |

4. వీనిలో సకర్మకములు (Transitive) అకర్మకములు (Intransitive) కర్త్రర్థకములు (Active) కర్మార్థకములు (Passive) భావార్థకములు (Impersonal) అని భేదములు కలవు.

5. సకర్మకములకు కర్మ (object) ఉండును. అకర్మకములకు కర్మ ఉండదు. కర్త్రర్థకములు కర్త (Subject)ను చూపును. కర్మార్థకములు కర్మను చూపును. భావార్థకములు కర్తను చూపక క్రియయొక్క పనిని లేక స్థితిని మాత్రము తెలుపును. అకర్మక క్రియలు కర్మార్థకములో నున్నపుడు భావార్థకములనఁబడును.

ఉదా:—रामोऽश्वमारोहति - ఇట క్రియకర్త్రర్థకము
रामेण फलं भुज्यते - ఇట క్రియకర్మార్థకము
रामेण स्थीयते - ఇట క్రియభావార్థకము

సంస్కృత క్రియల (Tenses)ను క్రియజరుగునట్టి రీతి (mood) ని తెలుపుటకు పది విధములుకలవు. వీనికి (దశ=పది) 'ల' కారములని పేరు. ఇవి లట్, లిట్, లుట్, లృట్, లేట్, లోట్, లఙ్, లిఙ్, లుఙ్, లృఙ్ అనునవి. వీనిలో లేట్ అనునది ఇప్పుడు వాడుకలో లేదు. మిగిలిన తొమ్మిది మాత్రమే వాడుకలో ఉన్నవి. క్రియ తెలుపు కాలములు లట్, లిట్, లుట్, లృట్, లోట్, లఙ్, లిఙ్, లుఙ్, లృఙ్ అనునవి.

క్రియ తెలుపు రీతులు (moods) మూఁడు:— ఇవి (1) సంగతిని తెలుపురీతి (Indicative mood).

లట్ మొదలు లృఙ్ వఱకునుగల కాలములన్నియు సంగతిని తెలుపునవి, అనగా Indicative mood లో ఉండునవి.

(2) లిఙ్ అనునది విధి, ఏర్పాటు, పిలుపు, కోరిక, విచారణ, ప్రార్థనలను తెలుపును. ఇది ఆశీర్వాదమును కూడ తెలుపును. కొందరు దీనినే Precative లేక Benedictive mood అందురు. ఇది తెనుఁగులో ఆశీరర్థకమునకు సరిపోలును. దీనిని ఆంగ్లపరిభాషలో Potential లేక Optative mood అందురు.

(3) ఆజ్ఞ, ప్రార్థన, ఆశీర్వాదములను తెలుపుటకు లోట్ అనునదివచ్చును. దీనిని తెనుఁగులో ప్రార్థనాద్యర్థకమందురు. ఆంగ్లమునందు దీనికి Imperative mood అని పేరు.

కాలములలో లట్ అనునది తెనుఁగులో వర్తమాన కాలము Present Tense లేక Present Indefinite Tense కుఁగాని తద్ధర్మార్థకమునకుగాని సమానమగును. ఇదేతి (Present Tense లేక Pr. Indef. Tense) అను దానికి తెనుఁగు వాడుకలో 'మాటాడును' మాటాడుచున్నాఁడు, మాటాడుచున్నది అని అర్థమగును.

లఙ్, లిట్, లుఙ్ భూతకాలము (Past Tense) ను తెలుపును. వీనిలో లఙ్ (Imperfect Tense) అనునది ఈదినమునకు ముందు జరిగిన (కర్తకు తెలిసిన) పనిని తెలుపుటకును లిట్ (Perfect) అనునది ఈదినమునకుముందు జరిగిన (కర్త చూడని) పనిని తెలుపుటకును వచ్చును. ఈరెండును తెట

చుగా చాలకాలమునకు ముందు జరిగిన పనులను తెలుపుటకు ఉపయోగించఁబడును. लुङ् (Aorist) అనునది సామాన్యముగా గతకాలములో పూర్తి అయినపనులను గాని ఈదినము జరిగినపనులనుగాని తెలుపును. ఇది ఆంగ్లములో Present Perfect Tense కు సమానమగును.

(3) लृट् (1st Future) అనునది ఈదినమునకు తర్వాత కొలఁదికాలిములో జరుగఁబోవు పనులను తెలుపును. ఇది Simple Future కు సమానము. ఇది భవిష్యత్కాలములలో ఒకవిధము.

(4) लुट् (2nd Future) అనునది దూరపు భవిష్యత్కాలమును తెలుపును. అనఁగా చాలకాలమునకు పిమ్మట జరుగఁబోవుపనులను తెలుపును.

(౬) लृङ् (Conditional Future లేక Conditional Tense) ఇది ఒకపని జరిగియుండినయెడల మఱియొకపని జరిగియుండును అనునిబంధన (condition) ను తెలుపుటకు లిఙ్ రాఁదగిన చోట ప్రయోగింపఁబడును. అనఁగా క్రియ తెలుపు పని వేఱొకపని జరుగకున్న పూర్తియగుట సందేహమని తెలుపుటకువచ్చును.

ఉ. सुवृष्टिः चेत् अभविष्यत् सुभिक्षम् अभविष्यत् =మంచి వర్షము కురిసియుండిన యెడల అన్నము పుష్కలము అయి ఉండును. सुवृष्टिः = మంచివర్షము अभविष्यत्=అయి ఉండును.

ఇట క్రియ వర్షము లేకున్న సుభిక్షము సందేహమని తెలుపు చున్నది.

ఈకాలము ఆంగ్లమున క్రియాఫలము సందేహాస్పద మని తెలుపుటకు would have, should have మొదలగు సహాయ క్రియలవలన ఏర్పడు క్రియల కాలమువంటిది.

ఉ. "I would have come if he had gone." వాఁడుపోయి ఉండినయెడల నేనువచ్చియుందును మొ॥

## ధాతువులు.

సంస్కృతధాతువులు పది తరగతులుగా భాగింపబడియున్నవి.

6. వీనికి వికరణులు (Conjugations) అని పేరు. ఇవి వరుసగా భూ, అద్, హు, దివ్, సు, తుద్, రుధ్, తన్, క్రీ, చుర్ ధాతు వులు అనునవి. భూ అనునది మొదటివికరణి(1st Conjugation) ఇవి మరల రెండుభాగములు చేయఁబడినవి. 1,4, 6, 10 వికరణులు మొదటిభాగములోను తక్కినవి రెండవభాగము లోను చేరును.

7. తెనుఁగులోవలెనే సంస్కృత క్రియలకుకూడ మూఁడు పురుషములు (Persons) కలవు. ప్రథమ పురుషము (1st Person), మధ్యమపురుషము (2rd Person), ఉత్తమ పురుషము (3rd Person) అని కాని ఒక్కొక్క పురుషమునకు ఏకవచనము (Singular), ద్వివచనము (Dual), బహువచనము (Plural) అని మూఁడు వచనములు (Numbers) కలవు.

(1) సంస్కృతములో ప్రథమపురుషము ఆంగ్లములో ఉత్తమపురుషము (Third person) అగును. ఏకవచనము ఒక వస్తువును, ద్వివచనము రెండింటిని, బహువచనము పెక్కింటిని తెలుపును.

(2) ప్రథమపురుషములో ఏకవచనమునందు క్రియకు 'వాఁడు', 'ఆమె,' 'అది' అనునవియు, ద్వివచనమునందు 'వారు ఇద్దఱు,' 'అవి రెండు' అనునవియును, బహువచనమునందు 'వారు, అవి' అనునవియును కర్త లగును. మధ్యమపురుషములో ఏకవచనమునందు 'నీవు'ను, ద్వివచనమునందు 'మీరు ఇద్దఱు'ను, బహువచనమునందు 'మీరు'ను కర్తలగును. ఉత్తమపురుషమునందు ఏకవచనములో 'నేను' ను, ద్వివచనములో 'మేము ఇద్దఱము లేక మనము ఇద్దఱము'ను, బహువచనములో 'మేము లేక మనము'ను కర్తలగును.

## కాలభేదములు (Tenses).

కాలభేదముల (Tenses) ను తెలుపునట్టి క్రియారూపములేర్పడుటకు కొన్ని పనులు చేయవలెను. అవి యేవనఁగా :—

(1) మనము తీసికొను ధాతువు పరస్మైపద ధాతువా ఆత్మనేపద ధాతువా అని చూడవలెను.

(2) ధాతువు మొదటి రూపమునకు గుణవృద్ధులవలనఁగాని వేరువిధముగాఁగాని కలుగునట్టి మార్పులను తెలిసికొనవలెను. వీనికి వికరణి గుర్తుల (Conjugational Signs) ను కనుఁగొనవలెను. ఏ కాలమును తెలుపఁగోరుదుమో ఆ కాల

ములో మూఁడు పురుషములయందును (ఏకవచన, ద్వివచన, బహువచనములయందు) చేర్చవలసిన ప్రత్యయములను అనఁగా తుదను చేర్చవలసిన వర్ణములను వికరణి గుర్తుతో చేర్చవలెను. పరస్మైపదధాతువులకు పరస్మైపద ప్రత్యయములను ఆత్మనేపద ధాతువులకు ఆత్మనేపద ప్రత్యయములను చేర్చవలెను. ఇట్లు చేయుటవలన కాలమును తెలుపునట్టి రూపము ఏర్పడును. కాలభేదములు తెలుపునప్పుడు క్రియలలో అచ్చటచ్చట కొన్ని మార్పులు చేయవలసివచ్చును. వానిని ఉదాహరణములవలన తెలియనగును.

ఈ గ్రంథమునందు మొదటిభాగములో చేరిన ధాతువులకు, అనఁగా 1,4,6,10 వికరణుల ధాతువులకు మాత్రము నాలుగు కాలములయందు రూపములు చూపఁబడును.

(1) 1,4,6,10 వికరణులకు వరుసగా अ, य, अ, अय అనునవి వికరణి గుర్తులు.

भू (అగు) అను ఒక ధాతువును తీసికొందము. ఇది 1-వ వికరణిలో చేరిన పరస్మైపద ధాతువు. ఇందలి ऊ గుణము వచ్చుటవలన ओ అగుటచేత దీనికి भो అను రెండవరూపము వచ్చును. ఈ రూపమునకు अ అను వికరణి గుర్తు చేరఁగా भो+अ=भव అగును.

(2) పరస్మైపద ధాతువులకు వర్తమానకాలము (लट्= Present లేక Present Indefinite Tense) లో,

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | ति | तः | अन्ति |
| మ. | सि | थः | थ |
| ఉ. | मि | वः | मः |

అను ప్రత్యయములు చేర్చఁబడును. ఇట్లు भू ధాతువుకు లట్ (వర్తమానకాలము).

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | भवति | भवतः | भवन्ति |
| మ. | भवसि | भवथः | भवथ |
| ఉ. | भवामि | भवावः | भवामः |

అని ఏర్పడును. ఇట भव అనుదానికి अन्ति అను ప్రత్యయము చేరునప్పుడు ముందుండు अ కారమునకు లోపము కలుగును. मि, वः मः లకు ముందుండు अ కారమునకు దీర్ఘము వచ్చును.

కాఁబట్టి, भव + अन्ति = भवन्ति

भव + सि = भवामि

भव + वः = भवावः

भव + मः = भवामः

నాల్గవ వికరణిలో य అనునదియు 6-వ వికరణిలో अ అనునదియు ప్రత్యయములు చేరుటకుముందు ధాతువుతో చేర్చఁబడును.

ఈ వికరణులలో ధాతువునందలి అచ్చుకు గుణము వచ్చుటవలన రూపము మారదు.

नश् (నశించు) పరస్మై. 4-వ వికరణి.

लट् (వర్తమానకాలము).

नश्+य=नश्य-దీనికి ప్రత్యయములు చేరఁగా,

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | नश्यति | नश्यतः | नश्यन्ति |
| మ. | —सि | —थः | —थ |
| ఉ. | नश्यामि | नश्यावः | नश्यामः |

అగును.

विश् (ప్రవేశించు) పరస్మై, 6-వ వికరణి.

लट् (వర్తమానకాలము).

विश् + अ = विश–ప్రత్యయములు చేరఁగా,

| | ఏ | ద్వి | బ. |
|---|---|---|---|
| ప్ర. | विशति | विशतः | विशन्ति |
| మ. | —सि | —थः | —थ |
| ఉ. | विशामि | विशावः | विशामः |

అని అగును.

गण् (లెక్కించు) పరస్మై, 10-వ వికరణి.

गण्+अय=गणय–ప్రత్యయములు చేరఁగా,

लट् (వర్తమానకాలము).

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | गणयति | गणयतः | गणयन्ति |
| మ. | —सि | —थः | —थ |
| ఉ. | गणंयामि | गणयावः | गणयामः |

ఈ వికరణి ధాతువులలో తుది అచ్చులకును కడపటి వర్ణమునకు ముందుండు అ కారమునకును పెక్కుచోట్ల వృద్ధి వచ్చుటచేతను, కడపటి వర్ణమునకు ముందుండు హ్రస్వాచ్చుకు కొన్నిచోట్ల గుణము వచ్చుటచేతను అయ చేరుటకుముందు మారురూపము వచ్చును.

ఉదా :—క్షల్, క్షాల్ (కడుగుకొను), పరస్మై, 10-వ వికరణి- क्षाल्+अय=क्षालय.

ల ట్ (వర్తమానకాలము).

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | क्षालयति | क्षालयतः | क्षालयन्ति |
| మ. | —सि | —थः | —थ |
| ఉ. | क्षालयामि | क्षालयावः | क्षालयामः |

चुर्, चोर् (దొంగిలించు); పరస్మై 10-వ వికరణి-चोर्+अय = चोरय.

ల ట్ (వర్తమానకాలము).

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | चोरयति | चोरयतः | चोरयन्ति |
| మ. | —सि | —थः | —थ |
| ఉ. | चोरयामि | चोरयावः | चोरयामः |

---

## ఆత్మనేపదప్రత్యయములు.

### లట్ (వర్తమానకాలము).

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | ते | इते | अन्ते |
| మ. | से | इथे | ध्वे |
| ఉ. | इ | वहे | महे |

పరస్మైపదములోవలెనే अन्ते కు ముందుండు अ కారము లోపించును. ఉత్తమ పురుషములో वहे, महे లకు ముందు अ కారము దీర్ఘమగును.

భాష్ (చెప్పుకొను) ఆత్మనే, 1-వ వికరణి.

### లట్ (వర్తమానకాలము).

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | भाषते | भाषेते | भाषन्ते |
| మ. | —से | —थे | —ध्वे |
| ఉ. | भाषे | भाषावहे | भाषामहे |

भाष + इते = भाषेते, भाष + अन्ते = भाषन्ते

भाष + वहे = भाषावहे, भाष + मह = भाषामहे.

युध् (యుద్ధముచేయు), ఆత్మనే, 4-వ వికరణి.

### లట్ (వర్తమానకాలము).

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | युध्यते | युध्येते | युध्यन्ते |
| మ. | —से | —थे | —ध्वे |
| ఉ. | युध्ये | युध्यावहे | युध्यामहे |

विद्, विन्द् (పొందు), ఆత్మనే, 6-వ వికరణి.

लट् (వర్తమానకాలము).

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | विन्दते | विन्देते | विन्दन्ते |
| మ. | —से | —थे | —ध्वे |
| ఉ. | विन्दे | विन्दावहे | विन्दामहे |

ఈ వికరణిలో ధాతువు తుదనుండు హ్రస్వ ఋ కారము रि గా మారును.

ఉదా:—मृ (చచ్చు) ఆత్మనే, 6-వ వికరణి, म्रिय् అగును. దీనికి వికరణి గుర్తు अ చేర్చిన म्रिय అగును. ఇట్లు దీనికి.

लट् (వర్తమానకాలము).

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | म्रियते | म्रियेते | म्रियन्ते |
| మ. | —से | —थे | —ध्वे |
| ఉ. | म्रिये | म्रियावहे | म्रियामहे |

मृग् (వెదకు) ఆత్మనే, 10-వ వికరణి.

लट् (వర్తమానకాలము).

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | मृगयतं | मृगयेते | मृगयन्ते |
| మ. | —से | —थे | —ध्वे |
| ఉ. | मृगये | मृगयावहे | मृगयामहे |

దీనియందలి ఋ కారమునకు గుణము రాదు.

## కర్మార్థకరూపములు, అకర్తృకరూపములు.

(1) ఇవి ఏర్పడుటకు ధాతువుకు య కారమును ఆత్మనే పద ప్రత్యయములును చేర్పవలెను.

ఉ. गम् – गम् + य + ते = गम्यते ;
त्यज् – त्यज् + य + ते = त्यज्यते ;

తక్కినవి गम्येते, गम्यन्ते ; त्यज्येते, त्यज्यन्ते మొ॥

(2) సంయుక్త హల్లు ముందు లేని ఋ కారము ధాతువు తుదను ఉన్నయెడల దానికి బదులు रि వచ్చును.

ఉదా:—कृ అనునది क्रि అగును. क्रि+य+ते=क्रियते ఇట్లు क्रियेते, क्रियन्ते మొ॥ ఏర్పడును.

(3) ధాతువు చివరనుండు इ, उ లకు య కారమునకు ముందు దీర్ఘము వచ్చును.

ఉదా:—जि+य+ते=जीयते (జయింపఁబడును.)

(4) కర్త్రర్థకము (Active voice) లో నుండు 10-వ వికరణి ధాతువులు వానియందలి అచ్చులకు గుణవృద్ధులవలన మార్పు కలిగినను కర్మార్థకము (Passive voice) లో పై విధముగానే ఉండును.

ఉదా:—चुर् (Active voice) चोर्यते (Passive voice) (దొంగిలించఁబడును).

---

లఙ్

దీనినే Imperfect Tense అనియు 1st Preterite అనియు చెప్పుదురు. ఇది భూతకాలములలో మొదటిది. ఇది కొంతకాలమునకు ముందు జరిగిన పనులను తెలుపుటకు వచ్చును. దీనికి పరస్మైపద ప్రత్యయములు:—

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | त् | ताम् | अन् |
| మ. | स् | तम् | त |
| ఉ. | अम् | व | म |

ఈ కాలము ఏర్పడుటకు మొదట ధాతువుకు ముందు అ కారము పెట్టవలెను. పిమ్మట వికరణి గుర్తులను ప్రత్యయములను చేర్పవలెను. अम् అను ప్రత్యయము చేరినప్పుడు దానికి ముందుండు అ కారమునకు లోపము కలుగును.

లఙ్ (Imperfect లేక 1st Preterite.)

भू (भव्)=అగు-పరస్మై, 1-వ వికరణి.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | अभवत् | अभवताम् | अभवन् |
| మ. | —: | —तम् | —त |
| ఉ. | अभवम् | अभवाव | अभवाम |

ఉత్తమపురుషములో व కార म కారములకు ముందు అ కారము దీర్ఘమగును.

पुष् (పోషించు), పరస్మై, 4-వ వికరణి.

लङ् (Imperfect లేక 1st Preterite.)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | अपुष्यत् | अपुष्यताम् | अपुष्यन् |
| మ. | —: | —तम् | —त |
| ఉ. | अपुष्यम् | —ष्याव | —ष्याम |

स्पृश् (తాఁకు) పరస్మై, 6-వ వికరణి.

लङ् (Imp. లేక 1st Pre.)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | अस्पृशत् | अस्पृशताम् | अस्पृशन् |
| మ. | अस्पृशः | अस्पृशतम् | अस्पृशत |
| ఉ. | अस्पृशम् | अस्पृशाव | अस्पृशाम |

गण् (లెక్కించు), పరస్మై, 10-వ వికరణి.

लङ् (Imp. లేక 1st Pre.)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | अगणयत् | अगणयाताम् | अगणयन् |
| మ. | —: | —तम् | —त |
| ఉ. | —म् | —याव | —याम |

## లఙ్ (Imp. లేక 1st Pre.)

## ఆత్మనేపద ప్రత్యయములు.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | त | इताम् | अन्त |
| మ. | थाः | इथाम् | ध्वम् |
| ఉ. | इ | वहि | महि |

అచ్చులు మొదటనుండు ధాతువులకు अ కారమునకు బదులు आ కారము ఆగమముగా వచ్చును. ఇది దానికి పరమైన इ, ई లతో చేరి ऐ గాను, उ ऊ లతో చేరి औ గాను మారును. ऋ తో చేరినపుడు आर् అగును.

ఉదా :—ऋज् (సంపాదించు), ఆత్మనే 1-వ వికరణి. आ+ऋज्+अ+त=आर्जत=సంపాదించెను.

ईक्ष् (చూచు), ఆత్మనే, 1-వ వికరణి.

आ + ईक्ष् + अ+त = ऐक्षत.

## లఙ్ (Imp. లేక 1st Pre.)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | ऐक्षत | ऐक्षेताम् | ऐक्षन्त |
| మ. | —थाः | —थाम् | —ध्वम् |
| ఉ. | ऐक्षे | ऐक्षावहि | ऐक्षामहि |

जन् (जा), పుట్టు, ఆత్మనే, 4-వ వికరణి.

लङ् (Imp. లేక 1st Pre.)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | अजायत | अजायेताम् | अजायन्त |
| మ. | —थाः | —थाम् | —ध्वम् |
| ఉ. | अजाये | अजायावहि | अजायामहि |

लज्ज् (సిగ్గుపడు), ఆత్మనే, 6-వ వికరణి.

लङ् ((Imp. లేక 1st Pre.)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | अलज्जत | अलज्जेताम् | अलज्जन्त |
| మ. | —थाः | —थाम् | —ध्वम् |
| ఉ. | अलज्जे | अलज्जावहि | अलज्जामहि |

भूष् (అలంకరించు), ఆత్మనే, 10-వ వికరణి.

लङ् (Imp. లేక 1st Pre.)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | अभूषयत | अभूषयेताम् | अभूषयन्त |
| మ. | —थाः | —थाम् | —ध्वम् |
| ఉ. | अभूषये | अभूषयावहि | अभूषयामहि |

లాఙ్ (ప్రార్థనాద్యర్థకము)

Imperative Mood.

పరస్మైపద ప్రత్యయములు.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | तु | ताम् | अन्तु |
| మ. | లేదు | तम् | त |
| ఉ. | आनि | आव | आम |

ఈ 'ల'కారమునందు ప్రత్యయములకు ముందు వికరణి గుర్తులను చేర్చవలెను.

यज् (పూజించు), పరస్మై, 1-వ వికరణి.

లోఙ్ (ప్రార్థనాద్యర్థకము.)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | यजतु | यजताम् | यजन्तु |
| మ. | यज | यजतम् | यजत |
| ఉ. | यजानि | यजाव | यजाम |

तुष् (సంతోషించు), పరస్మై, 4-వ వికరణి.

లోఙ్ (ప్రార్థనాద్యర్థకము.)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | तुष्यतु | तुष्यताम् | तुष्यन्तु |
| మ. | तुष्य | —तम् | —त |
| ఉ. | तुष्यानि | तुष्याव | तुष्याम |

दिश् (చూపు), పరస్మై, 6-వ వికరణి.

లోట్ (ప్రార్థనాద్యర్థకము.)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | दिशतु | दिशताम् | दिशन्तु |
| మ. | दिश | —तम् | —त |
| ఉ. | दिशानि | दिशाव | दिशाम |

गण् (లెక్కించు), పరస్మై, 10-వ వికరణి.

లోట్ (ప్రార్థనాద్యర్థకము.)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | गणयतु | गणयताम् | गणयन्तु |
| మ. | गणय | —तम् | —त |
| ఉ. | गणयानि | गणयाव | गणयाम |

లోట్ లో పరస్మైపద ధాతువులకు ప్రథమమధ్యమ పురుషైకవచనములలో तात् అను ప్రత్యయము చేరిన రూపము వైకల్పికము.

ఉదా:—यजतु, यजतात्; यज, यजतात्; गणयतु, गणयतात्; गणय, गणयतात्.

లోట్

ఆత్మనేపద ప్రత్యయములు.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | ताम् | इताम् | अन्ताम् |
| మ. | स्व | इथाम् | ध्वम् |
| ఉ. | ऐ | आवहै | आमहै |

ईक्ष् (చూచు), ఆత్మనే, 1-వ వికరణి.

లోట్

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | ईक्षताम् | ईक्षेताम् | ईक्षन्ताम् |
| మ. | ईक्षस्व | ईक्षेथाम् | ईक्षध्वम् |
| ఉ. | ईक्षै | ईक्षावहै | ईक्षामहै |

युध् (యుద్ధముచేయు), ఆత్మనే, 4-వ వికరణి.

లోట్

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | युध्यताम् | युध्येताम् | युध्यन्ताम् |
| మ. | युध्वस्व | युध्येथाम् | युध्यध्वम् |
| ఉ. | युध्यै | युध्यावहै | युध्यामहै |

विद्, विन्द् (పొందు), ఆత్మనే, 6-వ వికరణి.

లోట్

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | विन्दताम् | विन्देताम् | विन्दन्ताम् |
| మ. | विन्दस्व | विन्देथाम् | विन्दध्वम् |
| ఉ. | विन्दै | विन्दावहै | विन्दामहै |

मृग् (వెదకు), ఆత్మనే, 10-వ వికరణి.

లోట్

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | मृगयताम् | मृगयेताम् | मृगयन्ताम् |
| మ. | मृगयस्व | मृगयेथाम् | मृगयध्वम् |
| ఉ. | मृगयै | मृगयावहै | मृगयामहै |

9

## లిఙ్ (ఆశీరాద్యర్థకము.)

## Potential లేక Optative Mood.

### పరస్మైపదప్రత్యయములు.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | ईत् | ईताम् | ईयुः |
| మ. | ईः | ईतम् | ईत |
| ఉ. | ईयम् | ईव | ईम |

### जीव् (బ్రతుకు), పరస్మై, 1-వ వికరణి.

## లిఙ్ (ఆశీరాద్యర్థకము.)

## Potential లేక Optiative Mood.

దీనిలో ప్రత్యయములకు ముందు వికరణి గుర్తులను చేర్చవలెను.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | जीवेत् | जीवेताम् | जीवेयुः |
| మ. | जीवेः | जीवेतम् | जीवेत |
| ఉ. | जीवेयम् | जीवेव | जीवेम |

### नृत् (ఆడు), పరస్మై, 4-వ వికరణి.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | नृत्येत् | नृत्येताम् | नृत्येयुः |
| మ. | नृत्येः | नृत्येतम् | नृत्येत |
| ఉ. | नृत्येयम् | नृत्येव | नृत्येम |

ప్రచ్ఛ్, పృచ్ఛ్ (అడుగు), పరస్మై, 6-వ వికరణి.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | पृच्छेत् | पृच्छेताम् | पृच्छेयुः |
| మ. | पृच्छेः | पृच्छेतम् | पृच्छेत |
| ఉ. | पृच्छेयम् | पृच्छेव | पृच्छेम |

पूज् (పూజించు), పరస్మై, 10-వ వికరణి.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | पूजयेत् | पूजयेताम् | पूजयेयुः |
| మ. | पूजयेः | पूजयेतम् | पूजयेत |
| ఉ. | पूजयेयम् | पूजयेव | पूजयेम |

లిఙ్

ఆత్మనేపద ప్రత్యయములు.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | ईत | ईयाताम् | ईरन् |
| మ. | ईथाः | ईयाथाम् | ईध्वम् |
| ఉ. | ईय | ईवहि | ईमहि |

वन्द् (నమస్కరించు), ఆత్మనే, 1-వ వికరణి.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | वन्देत | वन्देयाताम् | वन्देरन् |
| మ. | वन्देथाः | वन्देयाथाम् | वन्देध्वम् |
| ఉ. | वन्देय | वन्देवहि | वन्देमहि |

जन् (जा) పుట్టు, ఆత్మనే, 4-వ వికరణి.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | जायेत | जायेयाताम् | जायेरन् |
| మ. | जायेथाः | जायेयाथाम् | जायेध्वम् |
| ఉ. | जायेय | जायेवहि | जायेमहि |

विन्द् (పొందు), ఆత్మనే, 6-వ వికరణి.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | विन्देत | विन्देयाताम् | विन्देरन् |
| మ. | विन्देथाः | विन्देयाथाम् | विन्देध्वम् |
| ఉ. | विन्देय | विन्देवहि | विन्देमहि |

अव + धीर् = अवधीर् (నిర్లక్ష్యముచేయు),
ఆత్మనే, 10-వ వికరణి.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | अवधीरयेत | अवधीरयेयाताम् | अवधीरयेरन् |
| మ. | अवधीरयेथाः | अवधीरयेयाथाम् | अवधीरयेध्वम् |
| ఉ. | अवधीरयेय | अवधीरयेवहि | अवधीरयेमहि |

ఇచట ఒకచే వికరణిలోని ధాతువులకు పరస్మైపదరూపములయందును, ఆత్మనేపదరూపములయందును గల భేదమును తెలుపుటకు 1-వ వికరణిలోని రెండుధాతువులకు అన్ని 'ల'కారములును చూపఁబడును.

## भू (भव्), పరస్మై, 1-వ వికరణి.

### लट् (Pr. లేక Pr. Indef. Tense).

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | भवति | भवतः | भवन्ति |
| మ. | भवसि | भवथः | भवथ |
| ఉ. | भवामि | भवावः | भवामः |

### लिट् (2nd Preterite లేక Perfect Tense).

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | बभूव | बभूवतुः | बभूवुः |
| మ. | बभूविथ | बभूवथुः | बभूव |
| ఉ. | बभूव | बभूविव | बभूविम |

### लुट् (1st Future).

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | भविता | भवितारौ | भवितारः |
| మ. | भवितासि | भवितास्थः | भवितास्थ |
| ఉ. | भवितास्मि | भवितास्वः | भवितास्मः |

### लृट् (2nd Future).

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | भविष्यति | भविष्यतः | भविष्यन्ति |
| మ. | भविष्यसि | भविष्यथः | भविष्यथ |
| ఉ. | भविष्यामि | भविष्यावः | भविष्यामः |

లోట్ (Imperative Mood).

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | भवतु<br>भवतात् | भवताम् | भवन्तु |
| మ. | भव<br>भवतात् | भवतम् | भवत |
| ఉ. | भवानि | भवाव | भवाम |

లఙ్ (Imperfect లేక 1st Preterite.)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | अभवत् | अभवताम् | अभवन् |
| మ. | अभवः | अभवतम् | अभवत |
| ఉ. | अभवम् | अभवाव | अभवाम |

విధి మొ॥ యందు.

లిఙ్ (Potential Mood).

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | भवेत् | भवेताम् | भवेयुः |
| మ. | भवेः | भवेतम् | भवेत |
| ఉ. | भवेयम् | भवेव | भवेम |

ఆశీర్వాదమునందు.

లిఙ్ (Optative Mood).

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | भूयात् | भूयास्ताम् | भूयासुः |
| మ. | भूयाः | भूयास्तम् | भूयास्त |
| ఉ. | भूयासम् | भूयास्व | भूयास्म |

लुङ् (3rd Preterite లేక Aorist).

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | अभूत् | अभूताम् | अभूवन् |
| మ. | अभूः | अभूतम् | अभूत |
| ఉ. | अभूवम् | अभूव | अभूम |

लृङ् (Conditional Future).

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | अभविष्यत् | अभविष्यताम् | अभविष्यन् |
| మ. | अभविष्यः | अभविष्यतम् | अभविष्यत |
| ఉ. | अभविष्यम् | अभविष्याव | अभविष्याम |

एधू (వృద్ధియగు), ఆత్మనే, 1-వ వికరణి.

लट् (Pres. లేక Pr. Indef. Tense).

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | एधते | एधेते | एधन्ते |
| మ. | एधसे | एधेथे | एधध्वे |
| ఉ. | एधे | एधावहे | एधामहे |

लिट् (Perfect లేక 2nd Preterite).

| | | ఏ | ద్వి | బ |
|---|---|---|---|---|
| (1) | ప్ర. | एधाञ्चक्रे | एधाञ्चक्राते | एधाञ्चक्रिरे |
| | మ. | एधाञ्चकृषे | एधाञ्चक्राथे | एधाञ्चकृढ्वे |
| | ఉ. | एधाञ्चक्रे | एधाञ्चकृवहे | एधाञ्चकृमहे |

| | | | | |
|---|---|---|---|---|
| (2) | ప్ర. | एधाम्बभूव | एधाम्बभूवतुः | एधाम्बभूवुः |
| | మ. | एधाम्बभूविथ | एधाम्बभूवथुः | एधाम्बभूव |
| | ఉ. | एधाम्बभूव | एधाम्बभूविव | एधाम्बभूविम |
| (3) | ప్ర. | एधामास | एधामासतुः | एधामासुः |
| | మ. | एधामासिथ | एधामासथुः | एधामास |
| | ఉ. | एधामास | एधामासिव | एधामासिम |

## लुट् (1st Future).

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | एधिता | एधितारौ | एधितारः |
| మ. | एधितासे | एधितासाथे | एधिताध्वे |
| ఉ. | एधिताहे | एधितास्वहे | एधितास्महे |

## लृट् (2nd Future).

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | एधिष्यते | एधिष्येते | एधिष्यन्ते |
| మ. | एधिष्यसे | एधिष्येथे | एधिष्यध्वे |
| ఉ. | एधिष्ये | एधिष्यावहे | एधिष्यामहे |

## लोट् (Imperative Mood).

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | एधताम् | एधेताम् | एधन्ताम् |
| మ. | एधस्व | एधेथाम् | एधध्वम् |
| ఉ. | एधै | एधावहै | एधामहै |

లఙ్ (Imperfect లేక 1st Preterite).

| | ఏ | ద్వి | బ |
| --- | --- | --- | --- |
| ప్ర. | ऐधत | ऐधेताम् | ऐधन्त |
| మ. | ऐधथाः | ऐधेथाम् | ऐधध्वम् |
| ఉ. | ऐधे | ऐधावहि | ऐधामहि |

విధ్యాదులయందు.

లిఙ్ (Potential Mood).

| | ఏ | ద్వి | బ |
| --- | --- | --- | --- |
| ప్ర. | एधेत | एधेयाताम् | एधेरन् |
| మ. | एधेथाः | एधेयाथाम् | एधेध्वम् |
| ఉ. | एधेय | एधेवहि | एधेमहि |

అశీర్వాదమునందు.

లిఙ్ (Optative mood).

| | ఏ | ద్వి | బ |
| --- | --- | --- | --- |
| ప్ర. | एधिषीष्ट | एधिषीयास्ताम् | एधिषीरन् |
| మ. | एधिषीष्ठाः | एधिषीयास्थाम् | एधिषीध्वम् |
| ఉ. | एधिषीय | एधिषीवहि | एधिषीमहि |

లుఙ్ (3rd Pre. లేక Aorist).

| | ఏ | ద్వి | బ |
| --- | --- | --- | --- |
| ప్ర. | ऐधिष्ट | ऐधिषाताम् | ऐधिषत |
| మ. | ऐधिष्ठाः | ऐधिषाथाम् | ऐधिढ्वम् / ऐधिध्वम् |
| ఉ. | ऐधिषि | ऐधिष्वहि | ऐधिष्महि |

## లృఙ్ (Conditional Future).

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | ऐधिष्यत | ऐधिष्येताम् | ऐधिष्यन्त |
| మ. | ऐधिष्यथाः | ऐधिष्येथाम् | ऐधिष्यध्वम् |
| ఉ. | ऐधिष्ये | ऐधिष्यावहि | ऐधिष्यामहि |

II

ఈ క్రియలకు సంబంధించిన కొన్ని విషయములు జ్ఞప్తి యందుంచుకొనఁదగినవి:—

(1) గత్యర్థకములగు (పోవుట అర్థమగు) క్రియలతో వచ్చునట్టి స్థలమును తెలుపునామవాచకము ద్వితీయావిభక్తిలోఁగాని, చతుర్థీవిభక్తిలోఁగాని ఉండవలెను.

ఉ. रामः ग्रामं गच्छति = రాముఁడు గ్రామమునకు పోవుచున్నాఁడు; दूतः नगराय प्रस्थितः - దూత నగరమునకు బయలుదేరెను.

(2) క్రోధను, ఈర్ష్య, ద్రోహము, అసూయ అను గుణములను తెలుపు క్రియలు వానికి సంబంధించిన మనుష్యునిఁ గాని వస్తువునుగాని చూపు నామవాచకముయొక్క చతుర్థీ విభక్తితో అన్వయించును.

ఉ. नीचाः गुरवे द्रुह्यन्ति-నీచులు గురువునకు ద్రోహము చేయుదురు. नृपः दुष्टाय क्रुध्यति - రాజు దుష్టునిమీఁద కోపపడును. स्पृह (కోరు, అపేక్షించు) అను ధాతువుకు సంబం

ధించిన వస్తువును తెలుపు నామవాచకముకూడ చతుర్థీవిభక్తిలో ఉండవలెను.

ఉ. बालः फलेभ्यः स्पृहयति - బాలుఁడు పండ్లను కోరుచున్నాఁడు.

(3) नी (తీసికొనిపోవు), प्रच्छ् (అడుగు) याच् (యాచించు) అను ధాతువులు ద్వికర్మకములు, అనఁగా వీనికి రెండేసి కర్మలు వచ్చును.

ఉ. गोपः धेनूः ग्रामं नयति - గొల్లవాఁడు ఆవులను గ్రామమునకు తీసికొని (తోలుకొని) పోవుచున్నాఁడు. पथिकः बालं मार्गं पृच्छति - బాటసారి బాలుని మార్గమును అడుగుచున్నాఁడు. दरिद्रः धनिकं धनं याचते - దరిద్రుఁడు ధనవంతుని ధనమును యాచించు చున్నాఁడు.

(4) रुच् (ఇష్టపడు) అను ధాతువుకు సంబంధించిన నామవాచకము (మనుష్యుని పేరుగాని వస్తువు పేరుగాని) చతుర్థీ విభక్తిలో ఉండవలెను.

ఉ. गीतं न रोचते वृद्धाय - వృద్ధునికి పాట ఇష్టపడదు.

(5) కొన్నిచోట్ల कथ् (చెప్పు) అనుధాతువుకు రెండు కర్మలు వచ్చును. అప్పుడు రెండవకర్మ (మనుష్యుని తెలుపునది) షష్ఠీవిభక్తిలోఁగాని చతుర్థీవిభక్తిలోఁగాని ఉండవలెను.

ఉ. आचार्यः शिष्याय लेक शिष्यस्य कथाः कथयति - ఉపాధ్యాయుఁడు శిష్యునికి కథలు చెప్పుచున్నాఁడు.

III

ఇప్పుడు రెండవవికరణి (అదాదిగణము) లో చేరిన బ్రూ, బ్రుహ్ ధాతువులకు ఉభయపద (పరస్మైపద, ఆత్మనేపద) రూపములలో తొమ్మిది 'ల' కారములయందును కలుగు భేదమునకు దృష్టాంతము చూపఁబడును.

బ్రూ (మాటాడు), పరస్మై, 2-వ వికరణి.

లట్ (వర్తమానకాలము.)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | ब्रवीति | ब्रूतः | ब्रुवन्ति |
| మ. | ब्रवीषि | ब्रूथः | ब्रूथ |
| ఉ. | ब्रवीमि | ब्रूवः | ब्रूमः |

లేక

లట్ (వర్తమానకాలము.)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | आह | आहतुः | आहुः |
| మ. | आत्थ | आहथुः | ब्रूथ |
| ఉ. | ब्रवीमि | ब्रूवः | ब्रूमः |

లిట్

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | उवाच | ऊचतुः | ऊचुः |
| మ. | उवचिथ / उवक्थ | ऊचथुः | ऊच |
| ఉ. | उवाच / उवच | ऊचिव | ऊचिम |

लुट्

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | वक्ता | वक्तारौ | वक्तारः |
| మ. | वक्तासि | वक्तास्थः | वक्तास्थ |
| ఉ. | वक्तास्मि | वक्तास्वः | वक्तास्मः |

लृट्

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | वक्ष्यति | वक्ष्यतः | वक्ष्यन्ति |
| మ. | वक्ष्यसि | वक्ष्यथः | वक्ष्यथ |
| ఉ. | वक्ष्यामि | वक्ष्यावः | वक्ष्यामः |

लोट्

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | ब्रवीतु, ब्रूतात् | ब्रूताम् | ब्रुवन्तु |
| మ. | ब्रूहि, ब्रूतात् | ब्रूतम् | ब्रूत |
| ఉ. | ब्रवाणि | ब्रवाव | ब्रवाम |

लङ्

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | अब्रवीत् | अब्रूताम् | अब्रुवन् |
| మ. | अब्रवीः | अब्रूतम् | अब्रूत |
| ఉ. | अब्रवम् | अब्रूव | अब्रूम |

విధి లిఙ్

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | ब्रूयात् | ब्रूयाताम् | ब्रूयुः |
| మ. | ब्रूयाः | ब्रूयातम् | ब्रूयात |
| ఉ. | ब्रूयाम् | ब्रूयाव | ब्रूयाम |

ఆశీర్లిఙ్ (లిఙ్.)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | उच्यात् | उच्यास्ताम् | उच्यासुः |
| మ. | उच्याः | उच्यास्तम् | उच्यास्त |
| ఉ. | उच्यासम् | उच्यास्व | उच्यास्म |

లుఙ్

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | अवोचत् | अवोचताम् | अवोचन् |
| మ. | अवाचः | अवोचतम् | अवोचत |
| ఉ. | अवोचम् | अवोचाव | अवोचाम |

లృఙ్

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | अवक्ष्यत् | अवक्ष्यताम् | अवक्ष्यन् |
| మ. | अवक्ष्यः | अवक्ष्यतम् | अवक्ष्यत |
| ఉ. | अवक्ष्यम् | अवक्ष्याव | अवक्ष्याम |

ब्रू (మాటాడు), ఆత్మనే, 2-వ వికరణి.

लट्

| | ఏ | ద్వి | బ |
| --- | --- | --- | --- |
| ప్ర. | ब्रूते | ब्रुवाते | ब्रुवते |
| మ. | ब्रूषे | ब्रुवाथे | ब्रूध्वे |
| ఉ. | ब्रुवे | ब्रूवहे | ब्रूमहे |

लिट्

| | ఏ | ద్వి | బ |
| --- | --- | --- | --- |
| ప్ర. | ऊचे | ऊचाते | ऊचिरे |
| మ. | ऊचिषे | ऊचाथे | ऊचिध्वे |
| ఉ. | ऊचे | ऊचिवहे | ऊचिमहे |

लुट्

| | ఏ | ద్వి | బ |
| --- | --- | --- | --- |
| ప్ర. | वक्ता | वक्तारौ | वक्तारः |
| మ. | वक्तासे | वक्तासाथे | वक्ताध्वे |
| ఉ. | वक्ताहे | वक्तास्वहे | वक्तास्महे |

लृट्

| | ఏ | ద్వి | బ |
| --- | --- | --- | --- |
| ప్ర. | वक्ष्यते | वक्ष्येते | वक्ष्यन्ते |
| మ. | वक्ष्यसे | वक्ष्येथे | वक्ष्यध्वे |
| ఉ. | वक्ष्ये | वक्ष्यावहे | वक्ष्यामहे |

లోట్

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | ब्रूताम् | ब्रुवाताम् | ब्रुवताम् |
| మ. | ब्रूष्व | ब्रुवाथाम् | ब्रूध्वम् |
| ఉ. | ब्रवै | ब्रवावहै | ब्रवामहै |

లఙ్

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | अब्रूत | अब्रुवाताम् | अब्रुवत |
| మ. | अब्रूथाः | अब्रुवाथाम् | अब्रूध्वम् |
| ఉ. | अब्रुवि | अब्रूवहि | अब्रूमहि |

విధి లిఙ్

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | ब्रुवीत | ब्रुवीयाताम् | ब्रुवीरन् |
| మ. | ब्रुवीथाः | ब्रुवीयाथाम् | ब्रुवीध्वम् |
| ఉ. | ब्रुवीय | ब्रुवीवहि | ब्रुवीमहि |

ఆశీర్లిఙ్ (లిఙ్.)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | वक्षीष्ट | वक्षीयास्ताम् | वक्षीरन् |
| మ. | वक्षीष्ठाः | वक्षीयास्थाम् | वक्षीध्वम् |
| ఉ. | वक्षीय | वक्षीवहि | वक्षीमहि |

लुङ्

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | अवोचत | अवोचेताम् | अवोचन्त |
| మ. | अवोचथाः | अवोचेथाम् | अवोचध्वम् |
| ఉ. | अवोचे | अवोचावहि | अवोचामहि |

लृङ्

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | अवक्ष्यत | अवक्ष्येताम् | अवक्ष्यन्त |
| మ. | अवक्ष्यथाः | अवक्ष्येथाम् | अवक्ष्यध्वम् |
| ఉ. | अवक्ष्ये | अवक्ष्यावहि | अवक्ष्यामहि |

दुह् (పాలుపితుకు), పరస్మై, 2-వ వికరణి.

लट्

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | दोग्धि | दुग्धः | दुहन्ति |
| మ. | धोक्षि | दुग्धः | दुग्ध |
| ఉ. | दोह्मि | दुह्वः | दुह्मः |

लिट्

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | दुदोह | दुदुहतुः | दुदुहुः |
| మ. | दुदोहिथ | दुदुहथुः | दुदुह |
| ఉ. | दुदोह | दुदुहिव | दुदुहिम |

लुट्

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | दोग्धा | दोग्धारौ | दोग्धारः |
| మ. | दोग्धासि | दोग्धास्थः | दोग्धास्थ |
| ఉ. | दोग्धास्मि | दोग्धास्वः | दोग्धास्मः |

लृट्

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | धोक्ष्यति | धोक्ष्यतः | धोक्ष्यन्ति |
| మ. | धोक्ष्यसि | धोक्ष्यथः | धोक्ष्यथ |
| ఉ. | धोक्ष्यामि | धोक्ष्यावः | धोक्ष्यामः |

लोट्

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | दोग्धु / दुग्धात् | दुग्धाम् | दुहन्तु |
| మ. | दुग्धि / दुग्धात् | दुग्धम् | दुग्ध |
| ఉ. | दोहानि | दोहाव | दोहाम |

लङ्

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | अधोक् (ग्) | अदुग्धाम् | अदुहन् |
| మ. | अधोक् (ग्) | अदुग्धम् | अदुग्ध |
| ఉ. | अदोहम् | अदुह्व | अदुह्म |

విధి लिङ्

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | दुह्यात् | दुह्याताम् | दुह्युः |
| మ. | दुह्याः | दुह्यातम् | दुह्यात |
| ఉ. | दुह्याम् | दुह्याव | दुह्याम |

ఆశీర్లిఙ్ (लिङ्)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | दुह्यात् | दुह्यास्ताम् | दुह्यासुः |
| మ. | दुह्याः | दुह्यास्तम् | दुह्यास्त |
| ఉ. | दुह्यासम् | दुह्यास्व | दुह्यास्म |

लुङ्

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | अधुक्षत् | अधुक्षताम् | अधुक्षन् |
| మ. | अधुक्षः | अधुक्षतम् | अधुक्षत |
| ఉ. | अधुक्षम् | अधुक्षाव | अधुक्षाम |

लृङ्

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | अधोक्ष्यत् | अधोक्ष्यताम् | अधोक्ष्यन् |
| మ. | अधोक्ष्यः | अधोक्ष्यतम् | अधोक्ष्यत |
| ఉ. | अधोक्ष्यम् | अधोक्ष्याव | अधोक्ष्याम |

दुह् (పాలుపితుకు, ఆత్మనే, 2-వ వికరణి.)

లట్

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | दुग्धे | दुहाते | दुहते |
| మ. | धुक्षे | दुहाथे | धुग्ध्वे |
| ఉ. | दुहे | दुह्वहे | दुह्महे |

లిట్

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | दुदुहे | दुदुहाते | दुदुहिरे |
| మ. | दुदुहिषे | दुदुहाथे | दुदुहिध्वे / दुदुहिढ्वे } లేక |
| ఉ. | दुदुहे | दुदुहिवहे | दुदुहिमहे |

లుట్

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | दोग्धा | दोग्धारौ | दोग्धारः |
| మ. | दोग्धासे | दोग्धासाथे | दोग्धाध्वे |
| ఉ. | दोग्धाहे | दोग्धास्वहे | दोग्धास्महे |

లృట్

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | धोक्ष्यते | धोक्ष्येते | धोक्ष्यन्ते |
| మ. | धोक्ष्यसे | धोक्ष्येथे | धोक्ष्यध्वे |
| ఉ. | धोक्ष्ये | धोक्ष्यावहे | धोक्ष्यामहे |

లోట్

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | दुग्धाम् | दुहाताम् | दुहताम् |
| మ. | धुक्ष्व | दुहाथाम् | धुग्ध्वम् |
| ఉ. | दोहै | दोहावहै | दोहामहै |

లఙ్

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | अदुग्ध | अदुहाताम् | अदुहत |
| మ. | अदुग्धाः | अदुहाथाम् | अधुग्ध्वम् |
| ఉ. | अदुहि | अदुह्वहि | अदुह्महि |

విధి (లిఙ్)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | दुहीत | दुहीयाताम् | दुहीरन् |
| మ. | दुहीथाः | दुहीयाथाम् | दुहीध्वम् |
| ఉ. | दुहीय | दुहीवहि | दुहीमहि |

ఆశీర్లిఙ్ (లిఙ్)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | धुक्षीष्ट | धुक्षीयास्ताम् | धुक्षीरन् |
| మ. | धुक्षीष्ठाः | धुक्षीयास्थाम् | धुक्षीध्वम् |
| ఉ. | धुक्षीय | धुक्षीवहि | धुक्षीमहि |

लुङ्

| | ఏ | ద్వి | బ |
| --- | --- | --- | --- |
| ప్ర. | अदुग्ध / अधुक्षत | अधुक्षाताम् | अधुक्षन्त |
| మ. | अदुग्धाः / अधुक्षथाः | अधुक्षाथाम् | अधुग्ध्वम् / अधुक्षध्वम् |
| ఉ. | अधुक्षि | अधुक्षावहि | अधुक्षामहि |

लृङ्

| | ఏ | ద్వి | బ |
| --- | --- | --- | --- |
| ప్ర. | अधोक्ष्यत | अधोक्ष्येताम् | अधोक्ष्यन्त |
| మ. | अधोक्ष्यथाः | अधोक्ष्येथाम् | अधोक्ष्यध्वम् |
| ఉ. | अधोक्ष्ये | अधोक्ष्यावहि | अधोक्ष्यामहि |

---

## అధ్యాయము ౧౦.

### సమాసములు.

### (Compounds.)

అనేక పదములను చేర్చి ఒక్కటే పదముగా చెప్పుట సమాస మనఁబడును. ముఖ్యమైన సమాసములు :—

(1) तत्पुरुष, (2) कर्मधारय, (3) द्विगु, (4) बहुव्रीहि (5) अव्ययीभाव, (6) द्वन्द्व.

వీనిలోఁ జేరిన విశేష సమాసములు :—

(1) अलुक्, (2) गति, (3) नित्य, (4) असमर्थ సమాసములు.

సమాసార్థమును బోధించు వాక్యము విగ్రహమనఁ బడును.

I. తత్పురుషము (Determinative Compounds.)

ఇది రెండు పదములవలన ఏర్పడును. వీనిలో మొదటి పదముయొక్క అర్థము ముఖ్యము. ఇది ఎనిమిది విధములు—ఇవి:—

(1) ప్రథమా తత్పురుషము.

ఉ. उत्तरकायः=उत्तरः कायस्य=దేహముయొక్క క్రింది భాగము.

पूर्वकायः=पूर्वः कायस्य=దేహముయొక్క పై భాగము.

अर्धपिप्पली—अर्धं पिप्पल्याः=పిప్పలియొక్క సగము మొ॥

(2) ద్వితీయా తత్పురుషము :—

ఉ. अन्नबुभुक्षुः=अन्नं बुभुक्षुः=అన్నమును తినఁగోరిన వాఁడు.

खट्वारूढः=खट्वाम् आरूढः=మంచమును ఎక్కినవాఁడు.

(3) తృతీయా తత్పురుషము :—

ఉ. मासावरः=मासेन अवरः=నెలచేత చిన్నవాఁడు.

विद्यानिपुणः=विद्यया निपुणः=విద్యచేత నిపుణుఁడు (సమర్థుఁడు.)

(4) చతుర్థీతత్పురుషము :—

ఉ. भूतबलिः=भूतेभ्यो बलिः=భూతముల కొఱకు బలి.

यूपदारु=यूपाय दारु=యూపము కొఱకు దారు(కొయ్య.)

(5) పఞ్చమీ తత్పురుషము :—

ఉ. चोरभयम्=चोरात् भयम्=చోరునివలన భయము.

सुखापेतः = सुखात् अपेतः = సుఖమునుండి తొలఁగిన వాఁడు.

(6) షష్ఠీ తత్పురుషము:—

ఉ. राजपुरुषः=राज्ञः पुरुषः=రాజుయొక్క బంటు.

वृक्षमूलम्=वृक्षस्य मूलम्=చెట్టుయొక్క మొదలు మొ॥

(7) సప్తమీ తత్పురుషము :—

ఉ. स्थालीपक्वम् = स्थाल्यां पक्वम् = స్థాలియందు వండఁబడినది.

दानशौण्डः=दाने शौण्डः=దానమునందు ప్రసిద్ధుఁడు.

(8) నఞ్ తత్పురుషము :—

ఉ. अज्ञानम्=न ज्ञानम्= జ్ఞానము కానిది.

अब्राह्मणः=न ब्राह्मणः=బ్రాహ్మణుఁడు కానివాఁడు.

अनश्वः=न अश्वः=అశ్వము కానిది.

## II. కర్మధారయ సమాసము.

(Appositional Determinative Compounds.)

ఇది ఏడువిధములు :—

(1) విశేషణపూర్వపదకర్మధారయము:—ఇందు పూర్వ

పదము విశేషణముగాను ఉత్తరపదము విశేష్యముగాను ఉండును. మొదటిది రెండవదానియొక్క గుణమును వర్ణించును.

ఉ. नीलोत्पलानि=नीलानि च तानि उत्पलानि च=నల్లనివైన ఉత్పలములు (కమలములు) ఇట 'नील' అనువిశేషణము 'उत्पलानि' అను విశేష్యముయొక్క గుణమును తెలుపును

अल्पवातः = अल्पश्चासौ वातश्च = అల్పమైన వాయువు.
सत्सरांसि = सन्ति च तानि सरांसि च = మంచివైన సరస్సులు.
रम्यलता=रम्या चं सा लता च=రమ్యమైన లత (తీఁగ) మొ॥

(2) విశేష్యపూర్వపదకర్మధారయము:—ఇందు మొదటిపదము విశేష్యముగా నుండును.

ఉ. मयूरव्यंसकाः= व्यंसकाश्च ते मयूराश्च=వ్యంసకములైన (మోసముచేయు) నెమళ్లు.

वैयाकरण खसूचिः = ఖసూచి (ప్రతిభలేని) వైయాకరణుఁడు మొ॥

(3) విశేషణోభయపదకర్మధారయము:— ఇందు రెండు పదములును ఒక విశేష్యమునకే విశేషణములుగా నుండును.

ఉ. स्नातानुलिप्ताः = स्नाताश्च ते अनुलिप्ताश्च=స్నాతులును (వారు) అనులిప్తులును, అనఁగా స్నానముచేసినవారును (వారు) ఒడలికి పూఁతపూసికొన్నవారును అని యర్థము. ఇచట 'स्नात' అను పదము, 'अनुलिप्त' అనుపదము రెండు

విశేషణములు. भोज्योष्णम्=भोज्यं च (तत्) उष्णं च = భోజ్యము (అది) ఉష్ణమును.

भोज्य, उष्ण అనుపదములు రెండును విశేషణములు.

(4) ఉపమానోత్తరపదకర్మధారయము :— ఇందు రెండవపదము ఉపమానమును లేక పోలికను తెలుపును.

ఉ. पुरुष व्याघ्रः=पुरुषः व्याघ्र इव=పురుషుఁడు వ్యాఘ్రమువలె, అనఁగా పులివంటి పురుషుఁడు అని యర్థము. कपि-कुञ्जराः=कपयः कुञ्जराः इव=కపులు కుంజరములవలె.

అనఁగా ఏనుగులవంటి కోఁతులు. ఈసమాసముయొక్క విగ్రహములో 'इव' అనునది ఉపమానమును సూచించునట్టి పదము.

(5) ఉపమానపూర్వపదకర్మధారయము :— ఇందు పూర్వపదము ఉపమానమును తెలుపును.

ఉ. घनश्यामः = घन इव श्यामः = మేఘమువలె నల్లనివాఁడు; द्राक्षामधुरा = द्राक्षा इव मधुरा = ద్రాక్షవలె తీయనిది.

(6) సంభావనా పూర్వపద కర్మధారయము :—

ఉ. तमालवृक्षः = तमालः इति वृक्षः = తమాలము అను చెట్టు. विन्ध्य पर्वतः = विन्ध्यः इति पर्वतः = వింధ్య అను పర్వతము మొ॥

ఇందు మొదటిపదము పేరుగా ఉండును.

(7) అవధారణా పూర్వపద కర్మధారయము.

ఉ. युक्तिरत्नानि = युक्तयः एव रत्नानि = యుక్తులే రత్నములు. कल्पनोर्मयः = कल्पना एव ऊर्मयः = కల్పనలే ఊర్ములు, అనఁగా ఊహలే అలలు మొ॥

ఇందు మొదటిపదము చెప్పునది రెండవ పదముయొక్క అర్థమును దృఢపఱచును.

III. ద్విగుసమాసము.

(Numeral Determinative Compounds.)

(1) ఏకవద్భావిద్విగువు:—పెక్కు వస్తువులను ఒక్కటిగా తీసికొని సమాహారముగా (మొత్తముగా) చెప్పునది.

ఉ. पञ्चवटी = पञ्चानां वटानां समाहारः = అయిదు అయిన వటముల (మఱ్ఱిచెట్ల) యొక్క సమాహారము లేక చేరిక.

त्रिलोकी = त्रयाणां लोकानां समाहारः = మూఁడు అయిన లోకములయొక్క సమాహారము.

त्रिभुवनम् = त्रयाणां भुवनानां समाहारः = మూఁడైన భువనముల (ప్రపంచముల)యొక్క సమాహారము.

पञ्चगवम् = पञ्चानां गवां समाहारः = అయిదు అయిన గోవులయొక్క సమాహారము.

(2) అనేకవద్భావి ద్విగువు:—

ఉ. षाण्मातुरः = षण्णां मातॄणाम् अपत्यं पुमान् = ఆర్గురు తల్లులయొక్క అపత్యము (బిడ్డ) అయిన పురుషుఁడు (కుమారస్వామి).

अष्टाकपालः = अष्टसु कपालेषु संस्कृतः पुरोडाशः = ఎనిమిదియైన కపాలముల (మట్టి పిడతల)యందు సంస్కరింపఁబడిన పురోడాశము (హోమముచేయఁగా మిగిలినది).

## IV. బహువ్రీహి సమాసము.

## (Attributive Compounds.)

ఇందు ఏడు విధములు కలవు. ఇవి ద్విపద బహువ్రీహి మొదలగునవి. ఇది అన్యపదార్థ ప్రధానము, అనఁగా దీని యర్థము మఱియొకవస్తువుకు సంబంధించియుండును.

### 1. ద్విపద బహువ్రీహి.

ఇందు రెండుపదములు మాత్రము ఉండును.

ఉ. प्राप्ताग्निः = प्राप्तः अग्निः येन सः = ఎవనిచేత అగ్ని పొందఁబడినదో వాఁడు. ఇచట అగ్నిని పొందినవాఁడు మఱియొకఁడని యర్థము. दत्तपशुः = दत्तः पशुः यस्मै सः = ఎవనికొఱకు (కి) పశువు ఈయఁబడినదో వాఁడు. ఇచట పశువును తీసికొన్నవాఁడు మఱియొకఁడు. महाबलः = महत् बलम् यस्य सः = ఎవనికి బలము ఎక్కువో వాఁడు మొ॥

### 2. బహుపదబహువ్రీహి.

ఇందు పెక్కుపదములుండును.

ఉ. दिव्यसुन्दरविग्रहः = दिव्यः सुन्दरः विग्रहः यस्य सः= దివ్యము సుందరమును అగు రూపము ఎవనికో వాఁడు. नीलोज्ज्वलवपुः = नीलं च उज्ज्वलं च वपुः यस्य सः = నీలమును,

ఉజ్జ్వలమును (ప్రకాశమానమును) అగు దేహము ఎవనికో వాఁడు మొ॥

### 3. సంఖ్యోభయపదబహువ్రీహి.

ఇందు రెండు పదములును సంఖ్యలుగా ఉండును.

ఉ. द्वित्राः = द्वौ वा त्रयो वा= రెండుగాని మూఁడుగాని, पञ्चषाः = पञ्च वा षड्वा = అయిదుగాని ఆఱుగాని కలవి మొ॥

### 4. సంఖ్యోత్తరపదబహువ్రీహి.

ఇందు ఉత్తరపదము అనఁగా రెండవ పదము సంఖ్యగా ఉండును.

ఉ. उपदशाः = दशानां समीपे ये सन्ति ते = పదికి దగ్గఱగానుండునవి ఏవో అవి. उपैकादशाः = एकादशानां समीपे ये सन्ति ते = పదునొకటికి దగ్గఱగా ఉండునవి ఏవో అవి మొ॥

### 5. సహపూర్వపదబహువ్రీహి.

ఇందు 'సహ' అనునది పూర్వపదముగా ఉండును.

ఉ. सकलाः = कलाभिः सहवर्तन्त इति = కళలతో కూడనుండువారు (గనుక). सहसन्तानाः = सन्तानैः सह वर्तन्त इति = సంతానములతో కూడ ఉండువారు (గనుక).

### 6. దిగన్తరాళ లక్షణ బహువ్రీహి.

ఇది దిక్కులయొక్క అంతరాళ (నడిమిభాగము) లక్షణమును తెలుపును.

ఉ. उत्तरपूर्वा = उत्तरस्याश्च पूर्वस्याश्च दिशोर्यदन्तरालं सा = ఉత్తరపుదిక్కునకు తూర్పుదిక్కునకు ఏదినడుమ ఉండునది యో.

అది. दक्षिणपूर्वा = दक्षिणस्याश्च पूर्वस्याश्च दिशोर्यदन्तरालं सा = దక్షిణదిక్కునకును తూర్పు దిక్కునకును నడుమ ఉండునది ఏదిగలదో అది - మొ॥

## 7. వ్యతిహార లక్షణ బహువ్రీహి.

ఉ. मुष्टीमुष्टि = मुष्टिभिः मुष्टिभिः प्रहृत्य इदं युद्धं प्रवृत्तम् = పిడికిళ్లతో పిడికిళ్లతో గ్రుద్ది ఈ యుద్ధము జరిగినది (గనుక). केशाकेशि = केशेषु केशेषु गृहीत्वा इदं युद्धं प्रवृत्तम् = జుట్టుజుట్టు పట్టుకొని ఈ యుద్ధము జరిగినది (గనుక). ఇందలి పదములు పరస్పరము ఒకటే పనిని తెలుపును.

## V. అవ్యయీభావసమాసము.

## (Adverbial Compounds.)

ఇది రెండువిధములు - అవ్యయపూర్వపదమని, నామ. పూర్వపదమనియు. అవ్యయపూర్వపదమునందు అవ్యయము పూర్వపదముగా ఉండును.

ఉ. प्रत्यहम् = अहनि अहनि = దినదినము. यथाशक्ति = शक्तिम् अनतिक्रम्य = శక్తిని మించకుండ. నామపూర్వపదమునందు నామము పూర్వపదముగా ఉండును :—

ఉ. सूपप्रति = सूपस्य लेशः = పప్పుయొక్క లేశము, అ - కొంచెము పప్పు. शाकप्रति = शाकस्य लेशः = కూరయొక్క కొంచెము, అ - కొంచెము కూర - మొ॥

## VI. ద్వంద్వసమాసము.
## (Copulative Compounds.)

ఈ సమాసమునందు రెండుపదార్థములు ప్రధానముగా ఉండును. ఇది నాలుగు విధములు.

### (1) ద్విపదేతరేతరయోగద్వంద్వము.

రెండు పదములు ఒకటిగా చేరుట:—

ఉ. रामरावणौ = रामश्च रावणश्च = రాముఁడును, రావణుఁడును. भार्यापुत्रौ = भार्या च पुत्रश्च=భార్యయు పుత్త్రుఁడును.

### (2) బహుపదేతరేతరయోగద్వంద్వము.

అనేకపదార్థములు ఒకదానితో ఒకటిచేరుట:—

ఉ. धर्मार्थकाममोक्षाः = धर्मश्च अर्थश्च कामश्च मोक्षश्च = ధర్మమును అర్థమును కామమును మోక్షమును ధర్మార్థ కామ మోక్షములు.

### (3) ద్విపద సమాహారద్వంద్వము.

రెండు పదార్థములనుచేర్చి ఒక మొత్తముగా చెప్పుట.

ఉ. शीतोष्णम् = शीतं च उष्णं च तयोः समाहारः = శీతము ఉష్ణము రెంటియొక్క మొత్తము. सुखदुःखम् = सुखं च दुःखं च तयोः समाहारः = సుఖము దుఃఖము రెంటియొక్క మొత్తము.

### (4) బహుపద సమాహారద్వంద్వము.

అనేకపదార్థములను చేర్చి ఒక మొత్తముగా చెప్పుట.

ఉ. अश्वहस्तिरथम् = अश्वश्च हस्ती च रथश्च तेषां समाहारः= గుఱ్ఱము, ఏనుఁగు, రథము వీనియొక్క మొత్తము.

ढक्कामृदङ्ग पटहम् = ढक्का च मृदङ्गश्च पटहश्च तेषां समाहारः= ఢక్క, మద్దెల, తప్పెట వీనియొక్క సమాహారము.

వీనిలో అంతర్గతమైన విశేషసమాసము—

అలుక్సమాసము.

ఉ. कण्ठेकालः = कण्ठे कालः यस्य सः = మెడయందు నలుపుగలవాఁడు, जनुषान्धः = जनुषा अन्धः = పుట్టుకచేత గ్రుడ్డి = పుట్టుగ్రుడ్డి.

---

# వృత్తులు.

## కృద్వృత్తి.

క్రియయొక్క రూపము మారి ఏర్పడు విశేష్యము (వస్తువాచకము) కృద్వృత్తి యనఁబడును.

ఉ. (1) भजन्त इति - भक्ताः = భజించువారు గనుక భక్తులు.

(2) म्रियन्त इति = मर्त्याः = చచ్చువారు గనుక మర్త్యులు.

(3) न म्रियन्त इति = अमराः = చచ్చువారు కారు గనుక అమరులు.

(4) ज्ञायते अनेनेति = ज्ञानम् = దీనిచేత తెలిసికొనఁబడును గనుక జ్ఞానము.

(5) उच्यते इति = = చెప్పఁబడునది గనుక వాక్య

## తద్ధితవృత్తి.

ఉ. (1) मनोरपत्यानि पुमांसः = मानुषाः = మనువు యొక్క బిడ్డలైన పురుషులు - మానుషులు.

(2) अदितेरपत्यानि पुमांसः = आदितेयाः = అదితియొక్క బిడ్డలైనపురుషులు - ఆదితేయులు. ఒక నామవాచకమునుండి దానికి సంబంధించిన యర్థమును లేక వస్తువును తెలుపుటకు రూపభేదమును పొందివచ్చునట్టి నామవాచకము తద్ధితమనఁ బడును.

(3) दितेः अपत्यानि पुमांसः = दैतेयाः – దితియొక్క బిడ్డలైనపురుషులు - దైతేయులు.

(4) दशरथस्य अपत्यं पुमान् - दाशरथिः - దశరథుని బిడ్డ అయిన పురుషుఁడు - దాశరథి (రాముఁడు).

(5) पुलस्त्यस्य गोत्रापत्यं पुमान् - पौलस्त्यः - పులస్త్యుని వంశపుబిడ్డ అయిన పురుషుఁడు. పౌలస్త్యుఁడు (రావణుఁడు)

## ఏకశేషవృత్తి.

(ఒక్కటే మిగులుట.)

ఉ. 1. माता च पिता च - తల్లియు, తండ్రియు (ఇద్దఱికిని) - पितरौ.

2. सा च स च - ఆమెయు, అతఁడును (ఇద్దఱికిని)- तौ.

3. शिवा च शिवश्च - పార్వతియును, శివుఁడును (ఇద్దఱికిని) - शिवौ.

---

# సంస్కృతవ్యాకరణము.

## శుద్ధపత్రము.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 5 | 9 | क | कृ |
| 6 | 1 | थ्य | र्थ्य |
| 8 | 5 | घड | वढ |
| ,, | 6 | छढ | छठ |
| 10 | 9 | गुरुणाम् | गुरूणाम् |
| 10 | 17 | పూర్వనులకు | పూర్వపరములకు |
| 11 | 10 | घन+ऋद्धि | घन+ऋद्धिः |
| 15 | 11 | पैरधत | परैधते |
| 15 | 21 | रेम | रमे |
| 18 | 9 | आम्राङो एच | आङ्माङोश्च |
| 22 | 10 | अहर्यँुष्ये | अहँयुष्ये |
| ,, | 12 | उत्तरहँ्लिरवसि | उत्तरहँ्लिखसि |
| ,, | 14 | हरिवँन्दे | हरिँवन्दे |
| 22 | 16 | ग् | ण् |
| 24 | 14 | నింది | నిండి |
| 24 | 16 | गुरुणाम् | गुरूणाम् |
| 25 | 4 | नेप | नप |
| ,, | 5 | तरुन् | तरून् |
| 39 | 3 | मतीः | मती |
| 0 | 12 | गौर्या | गौर्या |
| 1 | 16 | పుంలిఙ్డ | పుంలిఙ్గ |
| 7 | 3 | వదన | వచన |
| 51 | 12 | कर्तॄ | कर्तृ |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 52 | 7 | आस् | अस् |
| 54 | 5 | సం. ప్ర. | — |
| 54-5-లో | | (బహువచనములో తప్పు) విభక్తులలో-అని ఉండవలెను. "విభక్తులలో" అనుమాట (Brackets) కు అవతల ఉండవలెను. | |
| 54 | 17 | वन्त् | वन्त्-मत् |
| 54 | 18 | वान् | वान्, मान् |
| 55 | 21 | ఐశ | ఐశే |
| 57 | 13 | సం. ప్ర. | — |
| 57 | 16 | రాజ | రాజు |
| 58 | 11 | इ కారము | इ కారఅకారములు |
| 59 | 8 | राजन् | राज्ञ् |
| 59 | 10 | ज्ञ | ज्ञ् |
| 59 | 17 | अत्मनः | आत्मनः |
| 60 | 13 | महिमन् | महिम्न् |
| 62 | 16 | पुवस् | पुंयस् |
| 62 | 19 | त् | ष् |
| 63 | 3 | ములలో | ములతో |
| 63 | 4 | మొదటనుండు | అంతమందుండు |
| 63 | 9 | సం. ప్ర. | — |
| 63 | 19 | ह् | ह्ह् |
| 64 | 8 | (हं) ,, | (हे)श्रेयन् |
| 64 | 19 | (हे) ,, | (हे) वेधः |
| 64 | 21 | भ्यांम् | भ्याम् |
| 66 | 1 | गरयोभिः | गरीयोभिः |
| 67 | 6 | भ्याम् | भ्यांम् |
| 67 | 6 | भिः | भिंः |
| 67 | 7 | भ्यः | भ्यंः |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 69 | 2 | ना | नी |
| 70 | 4 | पुस् | पुंस् |
| 72 | 3 | धिया | धिया |
| 74 | 6 | इ ం | ई ం |
| 74 | 16 | ,, | ,, |
| 76 | 7 | पदभ्याम् | पद्भ्याम् |
| 76 | 15 | अद्भ्यः | अद्भिः |
| 77 | 17 | त्व | त्व, स्वत् |
| 77 | 19 | स्वत् | — |
| 78 | 2 | యొక్క | యొక |
| 78 | 16 | మునకు | ములకు |
| 79 | 10 | లకు | నకు |
| 83 | 12 | त्वा | त्वया |
| 84 | 1 | अस्यद् | अस्मद् |
| 88 | 20 | तिस्रभ्यः | तिसृभ्यः |
| 89 | 1 | त्रिभ्यः | त्रिभिः |
| ,, | 16 | పులింగ్గ | పుంలిఙ్గ |
| 91 | 16 | सुर्री | सुरी |
| 93 | 3 | मरा | राम |
| 95 | 12 | वरायस् | वरीयस् |
| ,, | 15 | द्रढिष्ट | द्रढिष्ठ |
| 105 | 15 | ।कल | किल |
| ,, | 19 | अय | अये |
| 106 | 10 | यथा | ఏప్రకారము (సంబంధార్థకము) |
| ,, | ,, | यदा | ఎప్పుడు (సంబంధార్థకము) |
| 120 | 17 | मह | महे |
| 121 | 20 | मृगयत | मृगयते |
| 124 | 16 | यातम् | यताम् |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 125 | 13 | इक्षू | ईक्षू |
| 139 | 20 | यात | यति |
| 141 | 13 | ब्रताम् | ब्रूताम् |
| 111 | 12 | रामण | रामेण |
| 142 | 14 | अवाचः | अवोचः |
| 143 | 9 | उचिरे | ऊचिरे |
| „ | 10 | ऊचिम्व | ऊचिध्वे |
| „ | 16 | स्मह | स्महे |

## నిఘంటువులు.

| | | రు. | అ. |
|---|---|---|---|
| ప్రతి 1-కి | | | |
| శ్రీవేంకటేశాంధ్రము, పద్యకావ్యము | ... | 0 | 6 |
| బాలచంద్రోదయము | ... | 0 | 8 |
| షడ్భాషామంజరి, (ఆరుభాషల ఒకేబ్యులరి) | ... | 1 | 8 |
| తెనుగుసామెతలు with English Translation by Captain Carr | ... | 1 | 4 |
| శబ్దార్థచంద్రిక, శ్రీమహాకాళి సుబ్బారాయకృత ఆంధ్ర నిఘంటువు | ... | 6 | 0 |
| ankaranarayana's English-Telugu Dictionary, ంకరనారాయణగారి నిఘంటువు (ఇంగ్లీషు పదములకు తెనుఁగు అర్థముగలది) | ... | 12 | 0 |
| nglish-Telugu Pocket Dictionary ఇంగ్లీషు-తెనుఁగు పాకెట్టుడిక్షనరి | ... | 3 | 8 |
| ranslation Guide-English to Telugu & Vice Versa. | | 2 | 8 |
| ంస్కృతాంధ్రనిఘంటువు | ... | 3 | 8 |
| త్రికాండశేషము, సటీక | ... | 1 | 12 |
| విశ్వకోశము, (విశ్వనిఘంటువు) సటీక | ... | 2 | 8 |
| ేదినీకోశము ,, | ... | 4 | 0 |
| ఏకాక్షరావళి, ఏకాక్షరీకోశము ,, | ... | 0 | 8 |
| అమరము, ప్రథమకాండము మూలము పెద్దఅచ్చు | ... | 0 | 4 |
| ,, ,, టీక | ... | 0 | 8 |
| అమరము 3 కాండలు, మూలము | ... | 0 | 12 |
| ధనంజయనిఘంటువు | ... | 0 | 12 |

## ఆంధ్రవ్యాకరణములు, అలంకారములు.

| | | | |
|---|---|---|---|
| ంచరంగరాట్ఛందము | ... | 1 | 8 |
| ఆంధ్రభాషాభూషణము, పద్యకావ్యము | ... | 0 | 6 |
| ఆంధ్రచంద్రాలోకము | ... | 0 | 12 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| కపిజనసంజీవని | ... | 0 | 8 |
| కవిసంశయవిచ్ఛేదము | ... | 0 | 8 |
| వెంకయ్యవ్యాకరణము | ... | 0 | 4 |
| ఆంధ్రశబ్దచింతామణి, సటీక | ... | 0 | 12 |
| ఆంధ్రశబ్దమంజరి బ॥ సీతారామాచార్యులు | ... | 0 | 8 |
| బాలవ్యాకరణము, శ్రీచిన్నయసూరిగారిది | ... | 1 | 0 |
| బాలవ్యాకరణము, దూశి రామమూర్తిగారి టీకతో | ... | 3 | 0 |
| చేటికాలపుకవిత్వము | ... | 3 | 0 |
| ప్రౌఢవ్యాకరణము | ... | 0 | 12 |
| బాలసరస్వతీయము | ... | 1 | 8 |
| విభక్తిచంద్రిక | ... | 0 | 6 |

—— వ్యాకరణము, అలంకారములు ——

| | | | |
|---|---|---|---|
| అభినయదర్పణము, సాంధ్రతాత్పర్యము | ... | 1 | 4 |
| భరతరసప్రకరణము ,, | ... | 0 | 12 |
| అథర్వణకారికావళి, టీకాతాత్పర్యము | ... | 1 | 8 |
| ఆంధ్రీకృతన్యాయదర్శనము, ప్రథమభాగము | ... | 1 | 4 |
| చంద్రాలోకము, సటీక | ... | 0 | 12 |
| సిద్ధాంతమంజరీ, ధాతుమంజరీ | ... | 0 | 6 |
| తర్కసంగ్రహము, సవ్యాఖ్యానము | ... | 1 | 4 |
| ప్రతాపరుద్రీయము ,, | ... | 2 | 4 |
| లఘుకౌముది, సటిప్పణము | ... | 1 | 0 |
| ఆంధ్రీకృతలఘుసిద్ధాంతకౌముది | ... | 3 | 0 |
| న్యాయకుసుమాంజలి, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 3 | 0 |
| శబ్దమంజరి, శుద్ధప్రతి | ... | 0 | 8 |
| డిటో (నాగరిలిపి) చిన్నసైజు | ... | 0 | 6 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.